# ఆంధ్ర సచిత్ర వారపత్రిక




దీపావళి సంచిక

29-10-
75

గంగాధర్

రాజబాబు సమర్పించు బాబ్ అండ్ బాబ్ రిక్రియేషన్స్

# మనిషి రోడ్డున పడ్డాడు

కథ: రాజ్‌బాబు   స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: సి.వి. రమణ్‌జీ

నిర్మాత: శ్రీమతి లక్ష్మీఅమ్మాలు

సహనిర్మాతలు: జె.వి.యస్.ఆర్. శాస్త్రి  చిట్టిబాబు B.com







అన్నపూర్ణ ఫిలింస్

ANNAPURNA PUBS

త్రిమూర్తి ప్రొడక్షన్స్



# భలే దొంగలు

(కలర్)

DIMPLE

alpana

దర్శకత్వం: కె.యస్.ఆర్. దాస్ నిర్మాతలు: సాంబశివరావు, బాబ్జీ

సంగీతం: సత్యం మాటలు: భమిడిపాటి ఫొటోగ్రఫీ: పుష్పాలగోపీకృష్ణ కళ: ఎస్.కృష్ణారావు



# కళ్లజోడు లేకుండ మీరు కంటి చూపు పొందగలరు!



మీకు ఇంతకన్న ఎక్కువ ఆనందాన్నిచ్చేవార్త మరొకటి ఉంటుందా!

## 'కాంటాక్ట్ లెన్స్'లను వాడండి

ఈ 'కాంటాక్ట్‌లెన్స్'లు హ్రస్వదృష్టి, దూరదృష్టి మరియు అఫాకిక్ (కాటరాక్టు ఆపరేషను పిమ్మట), కెరాటోకోనస్, అనిసోమెట్రోపియా, అనిసికోనియా, పాలియోపియా మొదలైన దృష్టిదోషములు కలవారికి ఉత్తమమైనవి.

'కాంటాక్ట్ లెన్స్'లను మీ కంటి పాపలకు మీకుమీరే అతిసులభంగా పెట్టుకొనవచ్చును... తీసివేసికొనవచ్చును - కొద్దిదినముల అభ్యాసంతో. మీ కళ్లకు పెట్టుకొన్న ఈచిన్న 'కాంటాక్ట్ లెన్స్'లు ఇతరులకు అగుపించవు. కనుక మీ సుందర ముఖంలో ఎట్టిమార్పును వుండదు

మీ కంటి వైద్యుని సంప్రదించండి

ఇతర వివరములకు: **ఆసియా కాంటాక్ట్ లెన్స్ లేబొరేటరీ**
**4/1, ఆండర్సన్ రోడ్,**
**మద్రాసు-600 006**

ఫోన్: **87865**

---

**నోవా బ్రిలియన్‌టైన్ మీ అందానికి మెరుగులు దిద్దుతుంది. ఈ రోజుల్లో నోవా బ్రిలియన్‌టైన్ వేలాది ప్రజలు ఉపయోగిస్తున్నారు.**

మీ శిరోజాలకు నోవా బ్రిలియన్‌టైన్ రాసి చూడండి. మీ క్రాపును రోజల్లా చెదరనీయకుండా చేస్తుంది. ఎప్పుడూ చక్కగా దువ్వుకొన్నట్లు వుంచి మీ అందానికి యింపును చేకూరుస్తుంది 'నోవా' మీ శరీరానికంతటికికూడా మృదుత్వం కోసం నోవాను పైపైన రాసుకోవచ్చును.

# ది నోవా కంపెనీ

లాల్ బహదూర్ శాస్త్రి మార్గ్, భండూప్, *బొంబాయి-400078.*






# మనలో మాట

దీపావళి కథలపోటీకి మేము యిచ్చిన తక్కువ వ్యవధిలోనే ఎక్కువ సంఖ్యలో కథలు వచ్చాయి కాని కథాకథన శిల్పం విషయంలోగాని, వస్తు వైవిధ్యంలోగాని యీసారి కూడా చెప్పుకోదగ్గ అభివృద్ధి లేదని చెప్పవలసి వస్తున్నది. సంపాదకుని ఎన్నికలో ఒక్కొక్కటి రూ. 600 చొప్పున బహుమతులందుకున్న ఐదు కథల పేర్లు యివి. ○ *ఇంకో సరిత కథ* ○ *గొడుగు* ○ *ఫోటో* ○ *సముద్రం* ○ *హెడ్ వెంకటస్వామి.* ఈ కథలలో అకారాది క్రమంలో మూడింటిని యీ సంచికలో వేశాము. తతిమ్మా రెండు కథలను వచ్చేవారం ప్రచురిస్తాము. రచయితల పేర్లు యిప్పుడు వెల్లడి చేయడంలేదు కారణం పాఠకులకు తెలుసు.

ఈ ఐదు కథలను పాఠకులు పరిశీలించి, బ్యాలట్ ద్వారా ఉత్తమమయిన కథను నిర్ణయించవలసి వుంటుంది. వచ్చేవారం బ్యాలట్ పత్రం, వ్యాసరచన పోటీ వివరాలు కూడా వేస్తాము.

* * *

దీపావళి కథల పోటీలో బహుమతులు పొందని కథలలో మరికొన్నిటిని మామూలు ప్రచురణకు ఎన్నుకొని ఆ వైనం ఆయా రచయితలకు త్వరలో తెలియజేస్తాము.

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు, రచయితలకు, ఏజెంటులకు, ప్రకటన కర్తలకు అందరికీ మా దీపావళి శుభాకాంక్షలు. ఈ సంచికలో మామూలుగా వేసే పేజీలకన్నా ఎనిమిది పేజీలు ఎక్కువ వేయగలిగినందుకు సంతోషిస్తున్నాము.

## ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

గోల్డెన్ జూబిలీ హీరో కృష్ణ ముఖచిత్రంతో వెలువడిన 15-10-76 తేదీ వారపత్రిక చూడగానే నేను పట్టరాని సంతోషముతో, ఎన్నడు అనుకోలేని రూపములో ప్రచురించినందుకు మిమ్ములను నేను హృదయ పూర్వకముగా అభినందించుచున్నాను.

మరి యొక గొప్ప విశేషమేమిటంటే ఈ పత్రికలో ప్రచురించిన కథలలో 'రాధా మాధవీయం' చాలా నైపుణ్యంతో, చదువుటకు ఆసక్తికరంగానూ, ఉన్నది.

దొడ్డి సత్యన్నారాయణ (అనకాపల్లి)

* * *

ఎవర్‌గ్రీన్ హీరో కృష్ణ ముఖచిత్రం ఈ వారం పత్రికకు ప్రత్యేక ఆకర్షణ. చాలా కాలం తరువాత హీరో కృష్ణ ముఖచిత్రం చూచి ఆనందించాను. డాక్టరు వనిత సీరియల్ నూతన పంథాలో అత్యంత ఆసక్తిదాయకంగా ఉన్నది. పత్రికలో ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ 30 పేజీలు ఉంటున్నవి. ఇంకా 20 పేజీలలో ఏ విషయాలు మీరు అందిస్తారు. ఈ విషయం గమనించి కథలు ఎక్కువగా ప్రచురించాలని ఆశిస్తున్నాను.

మండలపు రోశయ్య (బండ్లవారిపాలెం)

* * *

ఈ వారం 15.10.76 ముఖచిత్రం కృష్ణ ఎంతసేపు చూసినా తీరదే తృష్ణ. గడుసుదనంతో కూడిన సొగసుతనం నిండిన అతడు ఈ పత్రికా సుభద్రను వలచి [illegible] అర్జునుడు, బాగుంది కొత్త సీరియల్ 'మజిలీ' [illegible] చంద్రమౌళి.

మురారి సుబ్బారావు (నిడదవోలు)

### క్షయ

ఈ వారం 'క్షయ' గురించి చదివా. డా. [illegible] గారు చాలా చక్కగా తెలియజేయుచున్నారు. ప్రతి వారం ఇలా ఏదో ఒక వ్యాధి గురించి వివరిస్తే ఎంతో విజ్ఞాన దాయకంగా ఉంటుంది.

వనిత (మద్రాసు)

### కథలు

15.10.76 తేదీ వారపత్రికయందు ప్రచురితమైన శ్రీ [illegible] సుబ్రహ్మణ్యంగారి 'రాధా మాధవీయం' ప్రణయ కథానిక చాల బాగుంది. నాయిక [illegible] "రాధ" పాత్ర చిత్రీకరణ చాల రమ్యంగా సాగింది. రచయితగార్కి ధన్యవాదాలు. మీరు ముందుముందు ఇలాంటి రచనలు ప్రచురించి మమ్మానందింపజేయగలరు.

శ్రీమతి కె. సరస్వతి ([illegible])






పిల్లవెధవలు కొత్తబట్టల మీద అగ్గిరవ్వలు గట్రా పడేసుకుంటారని నేనే ఇలా కాల్చుకోమన్నా!!







## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 29–10–'76
నలనామ సం. కార్తీక శుద్ధ సప్తమి
*సంపుటము 70 : సంచిక : 9*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41–60
" ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

# పరిశుద్ధమైన కాఫీ త్రాగేవారికి తృప్తినిచ్చే ఇన్‌స్టెంట్ కాఫీ ఒక్కటి మాత్రమే!

# ఇది.




పరిశుద్ధమయిన కాఫీపొడి నుంచి నూటికి నూరుపాళ్లు ఇన్‌స్టెంట్ కాఫీ. అదీ విశేషం. దక్షిణ భారత దేశంలో లభ్యమయ్యే కాఫీ నిజపరిమళాన్ని మీకు యిస్తుంది నెస్‌కాఫే–తక్షణమే నూటికి నూరుపాళ్లు పరిశుద్ధ మయిన ఇన్‌స్టెంట్ కాఫీ యిది వొక్కటే!

# నెస్‌కాఫే

—100% పరిశుద్ధమైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక్క ఇన్‌స్టెంట్ కాఫీ



ప్రపంచమంతటా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ.

A NESTLÉ product

NNCM.23.TEL

రు 200 లు బహుమతి పొందిన కథ

# ఇంకో సరిత కథ

"ఇంకా అరగంట టైముంది ట్రెయిన్ కదలడానికి. కాఫీ తాగి వద్దామా ?" అన్నాడు నారాయణ, కిటికీ దగ్గర నిలబడి.

అది చూసి ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటు లోంచి కిందికి దిగింది సరిత.

రెస్టారెంటు దగ్గరికి నడిచారు.

"బెజవాడ చేరేసరికి మధ్యాహ్నం పన్నెండున్నరా, ఒంటిగంట అవుతుంది. ట్రెయిన్‌లోనే బ్రేక్‌ఫాస్ట్ సర్వ్ చేస్తారు. తీసుకో !"

సరిత మాట్లాడలేదు.

"ఎమ్! ఎమ్మెమ్ !" ప్రేమా, చనువూ కలిసిన పిలుపు

ఒకసారి కళ్ళెత్తి చూసి మళ్ళీ చూపులు పక్కకి తిప్పుకుంది. సరితకు అతను పెట్టిన ముద్దుపేరుకి ఇంగ్లీషు పొడి అక్షరాలు — ఎమ్. ఎమ్ — మాటలు రాని మొద్దు. సరిత ఎక్కువ మాట్లాడదు. ముభావంగా ఉంటుంది. తండ్రిపోలిక అంటారందరూ.

పెద్దవిగా, అందంగా ఉన్న ఆమె కళ్ళు కొద్దిగా పరధ్యానంగా, ఆలోచిస్తూ ఉంటాయి.

ఆ కళ్ళలో కళ్ళు పెట్టి చూడాలన్న ప్రయత్నం సఫలమవ్వక నారాయణ నవ్వేశాడు.

"చేతిలో కత్తి లేదు గాని, ఉంటె నన్ను చంపేసి ఉండేది మా సరిత" అన్నాడు.

చురుగ్గా చూసింది.

"లీవు దొరక లేదంటే నమ్మటంలేదూ. నువ్వు కాస్త ముందరే చెప్పి ఉంటే బాగుండేది సరితా! సరిగ్గా పండగ ముందు చెప్పావు. జాన్సీగారు రేసుల సీజన్ కోసం తెలివిగా ముందే ముప్ఫయ్ రోజుల లీవ్ గ్రాంట్ చేయించుకుని మలక్‌పేటలోనే మకాం పెట్టేశాడు. రేసులున్న రోజున రేస్‌కోర్సు కెళ్ళడం, లేనప్పుడు గుర్రాల వంశ చరిత్ర, పుట్టు పూర్వోత్తరాలూ, జాకీల గుణగణాలూ బేరీజు వేస్తూండడం... అదేపని. వాడు లీవ్ పెట్టకపోతే నను వదిలేవాడు."

'మీరూ లీవ్ పెట్టి ఉంటారు. రేసులు మిస్సవుతారని రావట్లేదు. ఆత్మీయులున్నారు గనీ మీకూ ఎప్పుడూ అవే లెక్కలు కదా !" అంది సరిత కొంచెం కోపంగా.

"అది కాదా ! ముందు కాఫీ తాగు. కోపం పోతుంది" అన్నాడు మాట మారుస్తూ.

కాఫీ అసహ్యంగా, పల్చగా, చల్లగా, ఉంది.

"కాఫీ ఇలా ఏడుస్తుందని నాకు ముందరే తెలుసు. అయినా ఎందుకు లాక్కొచ్చానో తెలుసా ?"

కళ్ళెత్తి చూసింది.

"ఇంకాసేపు నీకు దగ్గరగా నిలబడి మాట్లాడాలని."

సానపెట్టిన వజ్రంమీద సూర్యకిరణాలు పడి మెరిసినట్లు ఓ క్షణంలో ఎంతో సరిత కళ్ళలో సంతోషం.

ఆమె కోపమైనా, సంతోషమైనా అంతే. కనురెప్పలు దాటి బయటికి రాదు.



సరితని చూడగానే ఎవరూ ఆమె ఎమ్.ఏ. లిటరేచర్ ఫస్ట్‌క్లాస్ ఫస్టులో పాసయిందని అనుకోరు.

అలాగే ఆమెకు ఇరవైతొమ్మిది నిండి ముప్ఫైలోకి వస్తోందని కూడా ఎవరూ గ్రహించ లేరు

ఆమె చదువుగానీ, వయసు గానీ. మనసు గానీ ఆమె చెప్తేగానీ ఇంకెవరికీ తెలియదు. సరిత చెప్పదు.

ఆ మనసుకి అందమైన గవాక్షాలు సరిత కళ్ళు.

"రేసుల కెళ్ళి ఏ గుర్రం ముందు పరిగెడుతుందో అని గెస్ చెయ్యడం కాదు. అంతకంటె మంచి హాబీ ఉంది నాకు" అన్నాడు రామారావు.

ఏమిటన్నాయి సరిత కళ్ళు.

"ఓ అమ్మాయికి చెంపకి చేరడేసి ఉన్న కళ్ళలో స్పష్టాస్పష్టంగా మెదిలే భావాలు చదివెయ్యడం

సరిత చూపు కిందికి వాలిపోయి, వెంటనే పక్కకు తిరిగి బుక్ స్టాల్‌మీద నిలిచింది.

"నా వెల్వేమయినా తీసుకుంటావా?"

ఉలి ఊపి "హెరాల్డ్ రాబిన్స్ 'లోన్లీ లేడీ' తీసుకోనా?" లంది.

"తీసుకోమని సలహా ఇస్తే తర్వాత చూపుల్తోనే నన్ను దహించేస్తావు. అంత వల్గర్‌గా ఉంది."

సరిత మాట్లాడకుండా తను ఇదివరకు చదవని 'చేఘ' నవల ఒకటి కొన్నది.

ఇద్దరూ ట్రెయిన్ దగ్గరికి నడిచారు.

అంతకు ముందు రోజే పిండో సీటు ఒకటి రిజర్వు చేయించాడు రామారావు. పడ కుర్చీలో పరుపులేసినట్లున్నాయ్ సీట్లు.

"ఆ పాప చూడు." అన్నాడు నవ్వుటూ.

పక్కసీట్లో ఒకామె. ఆమె ఒళ్ళో చిన్ని పాపాయి. ఆరంభిస్తున్న జనం ముందు నిలబడి చివరి అంతస్తును చూస్తున్నట్లు తలెత్తి, మోరజాచి, తల్లి మొహం లోకి చూస్తోంది. ఆ భంగిమ చూసి సరిత కూడా నవ్వింది.

కొంచెం ముందుకు వంగి; గొంతుతగ్గించి అన్నాడు.

"నీలాంటి పెళ్ళాన్ని ఇచ్చాడు దేముడు. క్షేమంగా వుంది. అలాంటి పాపాయిని కూడా ఇస్తే బావుండు కదూ?"

సరిత మౌనంగా ఉండిపోయింది.

కానీ మనసు మాత్రం తుఫాను గాలికి సముద్రంలా ఎగసెగసి పడటం మొదలెట్టింది

అప్పటిదాకా ఏ మూలో దాక్కుని ఉన్న దిగులు, ఏ తల్లీ పిల్లల్నీ చూసినా బయట పడి మనసంతా ఆవరించేస్తుంది.

అప్పుడప్పుడు అనుమానం వస్తూ ఉంటుంది. తమకి పిల్లలు పుడతారా అసలు? అప్పుడే ఎనిమిదేళ్ళు దాటుతోంది పెళ్ళయి.

సరిత కళ్ళల్లోకే చూస్తున్న రామారావు తప్పు గ్రహించాడు.

"సరితా! ఊరికే అన్నాను. మనసులో పెట్టుకోకు. పిల్లల్లేకపోతేనేం. రాజా రాణీల్లా ఉన్నాం. చాలదూ?"

ట్రెయిన్ కూత వేసింది.

"నే వస్తా సరితా. వెళ్ళగానే జాబు రాయి. శనివారం మధ్యాహ్నం బయలు దేరి వస్తాను. స్టేషన్‌లో ఎదురుచూస్తుంటాను"




"సరే." అని చిరునవ్వుతో తల పంకించి చెయ్యి ఊపింది. రైలు కదిలింది.

రామారావు కనబడేనంత వరకూ కొద్దిగా వంగి, కిటికీలోంచి చూస్తున్న సరిత సర్దుకుని కూర్చుని పుస్తకం తెరిచింది.

"అల్లరి చెయ్యకమ్మా." అంటోంది పక్కావిడ పాపతో. అటువైపు చూసింది.

పాప ఒళ్ళో లేచి నిలబడి, తల్లి బొట్టుని అందుకుందామని చూస్తోంది.

అల్లరి చెయ్యకమ్మా.

ఎంతచక్కగా ఉంది వాక్యం!

తనకలా చెప్పడానికి లేకుండా తల్లి పురిట్లోనే చనిపోయింది. తను అలా చెప్ప డానికి తనకి పిల్లలు లేరు.

అమ్మా అని పిలవడానికీ, అమ్మా అని పిలిపించుకోవడానికీ కూడా లేదు తనకి.

అమ్మ పురిట్లోనే చనిపోయిందిట–తనని కనలేక.

ఎంత దారుణం!

తను హంతకురాలా?

కథల్లోలా, సినిమాల్లోలా, "తల్లిని చంపి పుట్టిన రాక్షసి" అని ఎవరూ తనని ఆడిపోసుకో లేదు.

అయినా తనకే మనసులో గాఢంగా పడి పోయింది ఆ భావం. మనసు సరిపెట్టుకోలేక పోతోంది.

అమ్మ చావుకి కారణం తనే. తను అసలు పుట్టి ఉండకపోతే అమ్మ బతికే ఉండేదేమో?

అమ్మ ఫొటోలు ఎన్నో ఉన్నాయి. చాలా బావుంటుంది తను. పొడుగ్గా, సన్నగా. ఆ పెద్ద పెద్ద కళ్ళే తనకి వచ్చాయి. మిగతా అంతా నాన్నగారి పోలికే. ముఖ్యంగా స్వభావం ఆడపిల్లలకి తండ్రి పోలికవస్తే అదృష్ట వంతులవుతారంటారు. తనది అదృష్టమా? దురదృష్టమా?

తన అదృష్టమో – దురదృష్టమో – తెలియని జీవితం. లక్ష్మి శ్రమలేకుండా లభ్యం సుదుపు. ఆకర్షణీయమైన రూపం. తనని అపురూపంగా చూసుకునే భర్త. ఇక దురదృష్టమో–

తను పుట్టి నాన్నగారికి భార్య లేకుండా చేసింది, తన్ను కట్టుకున్న భర్తకి పిల్లల్లేకుండా చేసింది.

ఇకపోతే అదృష్టమో, దురదృష్టమో తేల్చుకోలేనిది– అలిగా ఆలోచించే ఈ సున్నితమైన మనసు ఉండటం.

ఆలోచనలు - ఆలోచనలు!

భర్త కౌగిట్లో కంటే– ఆలోచనల పరిష్వంగం లోనే తను ఎక్కువ సమయం బందీగా ఉంటుంది.

అందుకే చిన్నప్పట్నుంచీ పుస్తకాలు ఎ. కంతో ప్రియమయ్యాయి. మాటలు కర వయ్యాయి.

చదవటం, ఆలోచించటం, ఆలోచిస్తూ చదవటం, ఇంకొకళ్ళు వడ్డిస్తుంటే భోజన



# ఇంకో సరిత కథ

చేస్తూ చేతిలో పుస్తకాన్ని చదువుతుండడం, చదువుతూ తినడం. తింటూ ఆలోచించడం.

"ఎందుకమ్మా డల్‌గా ఉంటావు ?" అనే వాళ్ళు అత్తయ్యలూ, బాబాయిలూ.

తను డల్‌గా ఉండదు. పరధ్యానంగా ఉంటుంది. అందుకనే తనకి స్నేహితులెక్కువ ఏర్పడలేదు. కానీ విచిత్రం ఏమిటంటే –

అదే గుణం రామారావుని ఆకర్షించి, పట్టుపట్టి తనని పెళ్ళాడేలా చేసింది.

వ్యతిరేక ధృవాలు సహజంగా దగ్గరయినట్లయింది.

ఆయన సరదా మనిషి. అన్నిటినీ తేలిగ్గా తీసుకునే స్వభావం.

కానీ అప్పుడప్పుడు ఆయనకీ చిరాకువేసేది.

"ఆలోచనలుండడం మంచిదే. కానీ మరీ అంతగా దేన్ని గురించీ ఆలోచించకు సరితా ! ప్రతిదానిలో తప్పు కనబడుతుంది. శాంతి ఉండదు." అంటారు.

కానీ ఏం చెయ్య గలదు ?

ఆలోచనలే తన వీక్‌నెస్.

ప్రతి సంఘటననీ, ప్రతి మాటనీ వివిధ కోణాల్లోంచి తరచి తరచి చూడడం. చూడగా చూడగా వాటిలో ఏదో తప్పు అర్థం గోచరించడం, తర్వాత తను ముభావంగా ఉండిపోవడం – మామూలే.

మనసు సంతోషంగా ఉన్నప్పుడు అలాకాదు.

తీరిగ్గా తనకున్న మధుర స్మృతులన్నిటినీ గుర్తు తెచ్చుకుంటూ, మనోఫలకం మీద సినిమాలా ప్రొజెక్ట్ చేసి చూసుకుంటూ ఉంటే వింత హాయిగా ఉంటుంది !

ఒక సంఘటన గుర్తొచ్చింది.

ఆ రోజు ...

ఆఫీసుకి వెళ్ళిన వారు సుడిగాలిలా పదకొండున్నరకే తిరిగి వచ్చేసి, పొంగిపోతున్న సంతోషాన్ని ఆపుకుంటూ.

"సరితా! మోస్ట్ హేపీ న్యూస్" ... ఏమిటో చెప్పుకో!" అంటే, ఓ క్షణం పరీక్షగా ఆయన మొహంలోకి చూసి, ఇంకో నాలుగు క్షణాలు ఆలోచించి, "ప్రమోషన్" అని చెప్పేసింది.

"అరె...ఎలా గ్రహించావ్! సరితా! మాటలు రాని మొద్దా!" అన్నారు ఆశ్చర్యపోతూ, తనని దగ్గరికి లాక్కుంటూ, నటిస్తూ.

ఆ సంతోష సమయంలో పెట్టిన నిక్‌నేమ్ తనకు స్థిరపడిపోయింది.

"మాటలురాని మొద్దునే కాని చదువురాని తెలివిలేని మొద్దును కాను. ఎప్పేలో క్లాసొచ్చింది తెలుసా! నెల రోజుల క్రితం మీరు ఆఫీస్ న్యూస్ ఒకటి చెప్పారు గుర్తుందా?" అంది మొగుడి చెవిలో.

"ఏ న్యూస్?...గాడ్...అదా!... సరితా! యు ఆర్ బ్రిలియంట్..." అని ఒక క్షణం ఆగి "సరితగారు ఇవ్వాళ ఒక్కసారే మూడు వాక్యాలు మాట్లాడేశారు ముత్యాల వర్షం కురుస్తుందేమో బహుశా" అన్నారు.

తను నవ్వింది.

"నే చెప్పలే!" అంటూ కిందకు వంగారు ముత్యాలేరడానికన్నట్లు.

పది నిమిషాల తర్వాత కాఫీ కలుపుతూ, దీనితోసహా చిన్నప్పట్నుంచీ జరిగిన మధుర సంఘటనలన్నీ గుర్తుకు తెచ్చుకుంటుంటే...

"ఇవ్వాళ కూడా పరధ్యానంగానే ఉన్నావు. నాకు ప్రమోషనొచ్చిందనే సంతోషం నీ కసలు లేదు" అంటూ అలిగారు.

తన సంతోషం ఆయన కెలా చెప్పేదీ?

మరీ ఎక్కువ ఆనందంగా ఉంటే, ఇంకా పరధ్యానంగా, తీరిగ్గా కూర్చుని, చెప్పా చెప్పక కాఫీ తాగుతూ, తియ్యతియ్యగా ఆలోచించు కోవడంలో ఉన్న సుఖం. ఆయనకు తెలిసే దెలా ? తనకి మాటల్తో చెప్పడం రాదు.

ఆయన దగ్గరగా ఉన్నప్పుడూ, ఆయన జీవితపు నిచ్చెన మెట్లు చకచక ఎక్కేస్తున్నారన్న ఆనందం ఉన్నప్పుడూ, మౌనమే తన తృప్తిగా, మీగడ తినేసిన పిల్లి పిల్లలా, అంతమైన కలల్లోకి వెళ్తూ జారిపోతుండటనీ ఇల్లు దాటి బయటికి వెళ్ళగానే తనకి ఇంత తృప్తిగా ఉండదనీ, ఏవేవో పిచ్చి పిచ్చి ఆలోచన లొస్తాయనీ చెప్పేదెలా ?

ఏదో స్టేషన్‌లో రైలాగింది.

నేవర్లూ, పుస్తకాలూ అమ్మే అబ్బాయి దగ్గర ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ కొంది. చెవిరింగు ఎవరో లాగుతున్నట్లయి పక్కకి తిరిగింది. పాప సీటుమీద వంగి నిలుచుని, ఉన్న రెండు పళ్ళూ బయటపెట్టి నవ్వుతూ రింగ్ వదిలేసి, జుట్టు పట్టుకుంది.

తనుకూడా నవ్వి, చేతులు చాచి పాపను ఎత్తుకోబోయింది. బావురుమని ఏడ్చేసింది పాప.

మనసు చివుక్కుమంది. పిల్లలంటే

మక్కువయినా, పిల్లల్ని చేరదియ్యడం చేత కాదు తనకి.

ట్రెయిన్‌లోనే ఉన్న రెస్టారెంట్‌లోంచి బేరర్లు జాంగ్రీలూ, వడలూ, సమోసాలూ ట్రేలలో పట్టుకుని అటూ ఇటూ తిరుగుతూ అమ్ముతున్నారు.

వరగడుపునే స్వీట్సు ఎలా తింటారో అనుకుంది సరిత. తనకి బయట ఏమీ తినటం ఇష్టం ఉండదు.

కాఫీ మాత్రం తెప్పించుకుని తాగింది.

కాఫీ వీక్‌గా, నిరుత్సాహంగా ఉంది.

ఆయన మాటలు గుర్తొచ్చాయ్.

తనుకూడా ఉంటే ప్రయాణం సరదాగా ఉండేదే.

ఆయన పద్ధతి వేరు. ప్రయాణాల్లోగానీ, పిక్నిక్కుల్లోగానీ, కనబడ్డవన్నీ తినెయ్యాలంటారు. ఆగిన ప్రతి స్టేషన్లో దిగడం, టీనో, కాఫీనో తాగి సిగరెట్టు కాల్చడం ... హడావిడిమనిషి. తను ఒక్కతే ఇలా వెళ్ళడం అంత బాగాలేదు.

ఆయన్ని రమ్మని ఎంతో బతిమాలుకుంది మామగారింట్లో ఆయనికి తోచదు. మొహమాటంగా ఉంటుంది. పైగా రేసుల సీజను. ఒక్క రేసుకూడా విడిచి పెట్టడానికి ఇష్టపడరు. తను సంవత్సరానికి ఓసారన్నా ఏదో ఒక పండక్కు వచ్చి, నాన్నగారిదగ్గర వారం రోజులుండి వెళ్ళడం రివాజు.

స్టేషన్ నుంచి బయటకు వచ్చి, లక్డీపేటకు రిక్షా మాట్లాడుకుని, ఎక్కింది. రిక్షా ఎత్తుగా, సింహాసనంలా, సౌఖ్యంగా ఉంది.

హైద్రాబాద్ రిక్షాలు గూడు బళ్లలా ఉంటాయి. శుభ్రంగా గంజి పెట్టి ఇస్త్రీ చేసిన చీరెలు క్షణంలో నలిగి పోతాయి. సాధారణంగా ఆయనతోబాటు స్కూటర్‌మీదే వెళ్ళిపోతుంది ఎక్కడి కెళ్ళాలన్నా. రిక్షా ఎక్కాల్సిన అవసరం ఎప్పుడో తప్ప రాదు.

సందులో చివరగా ఉన్న గేటు. బోగెన్ విల్లా చెట్టు.

సూట్‌కేస్ పట్టుకుని లోపలికి నడిచింది.

నాన్నగారు గదిలో కూర్చుని వున్నారు. చూడగానే లేచి వచ్చారు.

"ఒక్కదానివే వచ్చావా?" అన్నారు పలకరింపుగా.

"ఆయన కూడా వద్దామనుకున్నారు. లీవ్ దొరకలేదు," అంది సరిత.

**దీపావళి కథల పోటీలో**
**రూ. 600 లు**
**బహుమతి పొందిన కథ**

ఆయన కొంచెం చిక్కినట్లు, పాలిపోయినట్లు కనబడ్డారు.

"ఒంట్లో కులాసాగా ఉంటోందా నాన్నగారూ?" అంది.

"ఆఁ! ఫరవాలేదమ్మా!"

"ఎక్స్‌టెన్షన్ ఇస్తోందా కంపెనీ? లేకపోతే రిటైరవుతున్నారా?"

"వాళ్ళు ఇస్తామనే అంటున్నారు. నేనే వద్దందామనుకుంటున్నాను."

గదిలో బల్లమీద విస్కీ క్వార్టర్ బాటిలూ, పొడుగ్గా, నాజూగ్గా ఉన్న గ్లాసూ కనబడ్డాయి.

"మీరు డ్రింక్స్ మానెయ్యాలి" అని చెప్పాలని తహతహలాడింది ప్రాణం కానీ బావుండదని మానేసింది.

కూతురు పెళ్ళైపోయాక శివరావుగారు ఒంటరితనానికి అలవాటు పడలేక పోయారు. దూరపు బంధువుల అబ్బాయి ఒకడు ఖాళీగా ఉంటే అతనికి తన కంపెనీలోనే ఉద్యోగం ఇప్పించి, అతన్నీ, అతని భార్యనీ కూడా తమ ఇంట్లోనే వుండమన్నారు— తోడుగా ఉంటారని. నరసింహం రమా కూడా ఆయన మీద ఆప్యాయత పెంచుకుని కలిసిపోయారు.

"కృష్ణాలో వచ్చారా వదినా?" అంటూ పలకరించింది రమ.

"అవును. కులాసానా?" అంది చిరునవ్వుతో.

"ఆఁ. స్నానం చేస్తారా? వేణ్ణీళ్ళు పెట్టనా?"

"ఒద్దొద్దు. చన్నీళ్లయితే హాయిగా ఉంటుంది."

స్నానం చేసేలోగా రమ బంగాళాదుంపల వేపుడు చేసి, రెండు అప్పడాలు కాల్చి భోజనం వడ్డించేసింది.

భోంచేసి ఇదివరకటి తన గదిలోకి వెళ్ళింది. ఆ గది రూపు మారిపోయిందిప్పుడు. ఏవేవో సామాన్లున్నాయ్. రమ ఓ మంచం తెచ్చి అక్కడ వేసింది.

"పడుకోండి. సాయంత్రం ఈ గది సర్దుదాం" అంటూ.

పడుకుని "ఛేజ్" నవల చదువుతుంటే నెమ్మదిగా నిద్రపట్టేసింది. లేచిన తర్వాత తీరిగ్గా మూడు పేజీల ఉత్తరం రాసింది భర్తకి. తనకి నోరుతెరిస్తే మాటలు గుర్తురావు. కానీ కాగితం మీద పెన్ను పెడితే ఆగదింక.

* * *

రోజులు అలా నిదానంగా, బద్ధకంగా గడిచిపోయాయి. ఓ రోజుకీ, ఇంకో రోజుకీ తేడాలేదు. పొద్దుపోయి నిద్ర లేవడం, లేటుగా భోజనం చెయ్యడం, మధ్యాహ్నం నిద్ర. మిగతా సమయమంతా ఏది దొరికితే అది చదవడం— లేకపోతే పొగడ చెట్టుకింద కుర్చీ వేసుకుని రోడ్డుమీదకు చూస్తూ ఆలోచించుకోవడం —ఇదే దినచర్య.

శుక్రవారం రోజు.

తలారా స్నానం చేసి, బెంగాలీలు పెట్టుకున్నట్లు పాపిట్లో, నుదుటి మీదా కూడా కుంకుమ బొట్టు పెట్టుకుని, పేపరబ్బాయి పడేసి వెళ్ళిన రెండు రకాల న్యూస్ పేపర్లలో ఒకటి తీసుకొని తిరగేస్తోంది.

టెలిఫోన్ ఎప్పుడు మోగిందో వినలేదు.

కానీ కంగారుగా మాట్లాడుతున్న నాన్నగారి గొంతు విని రక్తం నీరయింది భయంతో.

ఆయన దాదాపు ఏడుస్తూ మాట్లాడుతున్నారు.

ఏమిటి? ఏమయింది?

భయ భ్రాంతురాలై నాన్నగారి దగ్గరకెళ్ళింది.

ఆయన రిసీవర్ పెట్టేసి, ఒణుకుతున్న చెయ్యి సరిత భుజం మీద వేశారు.

వంటింట్లో అట్లకాడతో రమా, మొహానికి సబ్బు పూసుకుని షేవ్ చేసుకుంటున్న నరసింహం, అలానే వచ్చేశారు.

"ఇంకెలా బతుకుతావే తల్లీ!" అస్పష్టంగా గొణుక్కుంటున్నారాయన.

"నాన్నగారూ! ఏమయింది?" మాట తడబడింది.

ఆయన మాటల అర్థం, ఆ తర్వాత చాలాసేపటిదాకా తలకెక్కలేదు.

అలాగే చతికిలపడి పోయింది.

తెల్లవారు ఝామున హైద్రాబాద్‌లో భారీ వర్షం పడిందిట. ఇంట్లో ఎక్కడో ఎలక్ట్రిసిటీ షార్ట్ సర్క్యూట్ అయింది. ఎవరూ గమనించక ముందే బయట పడేసిన బట్టలు అంటుకుని మంటలు ఇల్లంతా వ్యాపించాయి. రామారావు హాస్పిటల్‌కి











తీసుకెళ్తుండగా దోవలోనే పోయాడు.

అయిదు నిమిషాల తర్వాత స్తబ్ధత నుంచి బయట పడగానే సరితకు వచ్చిన మొదటి ఆలోచన.

తను ఇక్కడికి రాకుండా ఉంటే తనూ ఆయనతోబాటే చనిపోయి ఉండేది— ఈ దుఃఖం. ఈ తీరని లోటు లేకుండా.

ఇప్పటికయినా మించి పోలేదు.

అంత దుఃఖంలోనూ మనసు మరణానికి మార్గాలు ఆలోచించింది.

స్లీపింగ్ పిల్స్, టిక్ ట్వెంటీ, ఉరి, నీళ్లలో దూకెయ్యడం.

లేకపోతే ఆయనలానే మంటలకి ఆహుతై పోవడం.

అప్రమత్తంగా ఉన్న నాన్నగారూ, నరసింహం, రమా, సరిత ఆలోచనల తీరు గ్రహించినట్లు అనుక్షణం కనిపెట్టుకు ఉండి కనురెప్పలా చూశారు.

ఆ రోజు పన్నెండింటి కల్లా కార్లో హైద్రాబాద్ చేరుకున్నారు. దహన సంస్కారాలు యథావిధిగా జరిగాయి.

పదో రోజు కుంకుమ చెరిగి, గాజులు పగిలిన సరితకు అంప కంపాలతో జ్వరం వచ్చేసింది.

అది మొదలు.

అప్పట్నుంచీ ఏదో ఒక నలత. రెండు మూడు నెలలు ఆరోగ్యం కోలుకో లేక పోయింది సరిత.

డాక్టర్‌కి చూపించుకోకుండా, మందులు తీసుకోకుండా మొండికేసింది.

చివరికి సహనం చచ్చిపోయి శివరావుగారు "చిన్న పిల్లలా మంకుపట్టు పట్టకు సరితా! డాక్టరు వస్తుంది. టెస్ట్ చెయ్యనీ" అన్నారు కచ్చితంగా.

డాక్టర్ సమంత సరిత కంటె చిన్నదే.

## ఇంకో సరిత కథ

ప్రాక్టీస్ పెట్టి మూడు నాలుగు ఏళ్లే అయినా మంచి హస్తవాసి అని పేరొచ్చేసింది.

తెలివైనది కాబట్టి ముందుగానే సానుభూతి మాటలు మాట్లాడలేదు. మామూలుగా పలకరించి, ఆరోగ్యాన్ని గురించి వివరంగా ప్రశ్నలడిగి, పరీక్ష చేసింది.

ఆ తర్వాత కాసేపు ఆ సంగతులూ, ఈ సంగతులూ, తన ప్రాక్టీసు విషయాలు చెప్పింది.

తడుముకోకుండా స్పష్టంగా, తియ్యగా, మాట్లాడుతుంది సుమ.

"ఈ అమ్మాయిని చేసుకున్నవాడెవరో అదృష్టవంతుడు" అనుకొంది సరిత.

అప్రయత్నంగా అడిగేసింది.

"మీ వారేం చేస్తుంటారు?"

"మెడికల్ రెప్." అని కంపెనీ పేరుచెప్పి నవ్వింది. "బొంగరంలా తిరుగుతుంటారు ఇల్లు పట్టకుండా" అంది.

కాసేపు మౌనం.

తర్వాత అడిగింది సుమ.

"మీకేం అనుమానం రాలేదా?

"దేనికి?" అంది సరిత.

మెల్లగా అన్నది సుమ.

"మీరిప్పుడు ప్రెగ్నెంట్."

సరిత మాట్లాడలేదు.

నిజమే. తనకీ అనుమానంగానే ఉంది.

మరి ఏమిటి గత్యంతరం? అబార్షనా?

ఆయన వేసి వెళ్లిన ముద్రను తను చేతులారా చెరిపెయ్యగలదా?

అసంభవం.

సరితకు తనమీద తనకే అసహ్యం వేసింది.

తన కోరిక ఈ విధంగా తీరాలని అనుకుందా?

తనను ప్రేమించి ప్రేమించిన వ్యక్తి దూరమై పోయాక, నిస్సారమైన ఈ బ్రతుకులో ఇంకా కొత్త బంధాలెందుకు?

ఈ జీవితం చాలించాలన్న ఆలోచన విరమించాల్సి వచ్చింది.

నిర్లిప్తంగా నెలలు గడిచాయి.

ఒళ్లెలా భారంగా ఉంటోందో, బతుకు అంతకంటె భారంగా తోస్తోంది.

అయితే ఇప్పుడు ఇదివరకటంత హృదయాన్ని కోరికేసే బాధలేదు.

బతుకుమీద ఉత్సాహమూ లేదు.

తొమ్మిది నెలలూ నిండాక లక్షణమైన కొడుకు పుట్టాడు.

ఇంక సరిత జీవితానికి చివరి మలుపు.

ఒక సంవత్సరం పైన ఆరు నెలలు గడిచిన తర్వాత...సరిత డాక్టరు కన్సల్టింగ్ రూంలో కూర్చుని ఉంది. పిల్లవాణ్ని పరీక్షలు చేసిన తర్వాత డాక్టరు సరితని కూర్చోమని సైగ చేసింది.

సరిత కూర్చుంది.

డాక్టర్ కాసేపు తలవంచుకుని చేతిలోని పెన్‌టార్చిని చూస్తూ ఉండిపోయింది.

తర్వాత.

"మిసెస్ సరిత! దేముడు మనకి చేస్తున్న మంచిని చూసి సంతోషించాలే గానీ, జరుగుతున్న చెడుని గూర్చి మథనపడితే వచ్చేదేమీ లేదు. పిల్లవాడు మూగ. మామూలుగా మూగతనంతో పాటు చెముడు కూడా ఉంటుంది. ఈ ఒక్క లోపం తప్పిస్తే, పిల్లవాడికి ఏ వంకా ఉండదు. మీ అందం, మీ తెలివి తేటలు తన స్వంతం చేసుకు పుట్టాడు. ఆ కళ్ళు చూడండి ఎంత చురుగ్గా, అల్లరిగా ఉన్నాయో!" అంది ముచ్చటగా చూస్తూ.

"అంతేకాదు డాక్టర్. నేను నోరు ఉండీ



# హైదరాబాద్ నోట్ బుక్

**బాలల అకాడెమీ అవతరణ :**

మన రాష్ట్రం బాలల అకాడెమీ స్థాపనతో మరొక విషయంలో మార్గదర్శకమైంది. సెప్టెంబర్ 14వ తేదీన జూబిలీ హాలులో జరిగిన ఉత్సవంలో రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ఈ అకాడెమీకి ప్రారంభోత్సవం జరుపుతూ, దేశ అమూల్య సంపద అయిన బాలబాలికల ఎడల సరైన శ్రద్ధ చూపడం ద్వారానే దేశాన్ని సుసంపన్నం చేయగలమన్నారు. పిల్లల సర్వతోముఖాభివృద్ధికి ఈ అకాడెమీ కృషి చేయగలదని ఆయన ఆశాభావం వెల్లడించారు. విద్యాశాఖామంత్రి శ్రీ మండలి కృష్ణారావు స్వాగతం చెబుతూ, పవిత్ర బాలల విజ్ఞాన సర్వస్వం ప్రకటిస్తామన్నారు. గవర్నర్ శ్రీ భండారే, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, శ్రీమతి బేగం ఆబిదా, మహిళా సంక్షేమ శాఖమంత్రిణి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య అకాడెమీ మూడు పూవులు ఆరు కాయలు కావాలని ఆశించారు. బాలల అకాడెమీ ఆర్థికసలహాదారు డాక్టర్ అంతటి నరసింహం సందేశాలు వినిపించారు. అకాడెమీ కార్యదర్శి శ్రీ న్యాయపతి రాఘవరావు ధన్యవాదాలు తెలిపారు.

**రాష్ట్రస్థాయి బాలోత్సవం :**

విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు సెప్టెంబర్ 26 వ తేదీన రవీంద్రభారతిలో ఆంధ్ర బాలానందసంఘం 11 వ నాటకోత్సవం ప్రారంభిస్తూ, వచ్చే జనవరిలో రాష్ట్రబాలల అకాడెమీ పెద్ద ఎత్తున రాష్ట్రస్థాయిలో ఉత్సవాలు జరుపుతామని ప్రకటించారు. ఆంధ్ర బాలానంద సంఘం 1957 లో స్థాపితమైనది మొదలు బాలబాలికల మనో వికాసానికి చేస్తున్న అపార సేవను ఆయన ప్రశంసించారు. పట్టణ భూముల గరిష్ఠ పరిమితి ప్రత్యేకాధికారి శ్రీ కె. మోహన్ ముఖ్య అతిథిగా పాల్గొని బాలానందసంఘం సేవను వివరించారు. సెయింట్ ఆంథోని హైస్కూలు విభాగం బాలానంద సంఘం శకుంతలన్యత్యనాటకాన్ని, సీనియర్ సర్టిఫికేట్ స్కూలు విముక్తుడు నాటికను, ప్రగతి బాలానంద సంఘం ఎవరు దొంగ నాటికను, నవీన్ బాలానంద సంఘం కాంతికిరణం నాటికను ప్రదర్శించాయి. శ్రీమతి న్యాయపతి కామేశ్వరి స్వాగతం చెప్పారు. శ్రీ న్యాయపతి రాఘవరావు ధన్యవాదాలర్పించారు.

**మంత్రి రాజమల్లు సలహా :**

మన శాస్త్రాలన్నీ ఒక దశవరకు వచ్చి, కుల వృత్తులు కావడంతో ఎదుగు బొదుగు లేక ఆగిపోయాయి, అలాటివాటిలో ఒకటి ఆయుర్వేదం, ఆయుర్వేదమే అరబ్బులద్వారా పాశ్చాత్య విదేశాలకు వెళ్ళినా, ఎప్పటికప్పుడువృద్ధి పొందినవ్యవహారంతో విస్తరించింది ఆయుర్వేదం ఆగిపోయింది. సెప్టెంబర్ 28 వ ఆయుర్వేద అకాడెమీ శాస్త్రీయ గోష్ఠిని ప్రారంభిస్తూ రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖామంత్రి శ్రీ కె. రాజమల్లు సూచించినట్టు ఆయుర్వేదంలో ఆధునిక రీతిలో పరిశోధనలు జరగాలి. ఈ విషయాన్ని ఆయుర్వేద అకాడెమీ అధ్యక్షుడు శ్రీ కాళిదాస్‌కిస్తీవంటి వారు ఆచరణలో పెట్టాలి.

**గాంధీజీ తపాలాబిళ్ళ :**

గాంధిజీ 107 వ జయంతి జంటనగరాలలో పెక్కుచోట్ల జరిగింది. రాజభవన్‌లో జరిగిన సమావేశంలో గవర్నర్ భండారే ప్రసంగిస్తూ కేవలం సత్యాగ్రహాయుధంతో అన్యాయాన్ని ఎదుర్కొన్న మహావీరుడుగా గాంధిజీ చరిత్రలో అమరుడై నిలుస్తారని జోహార్లర్పించారు. గాంధిజ్ఞానమందిర్‌లో సూత్రయజ్ఞం, సమూహ ప్రార్థన జరిగాయి. రాష్ట్ర రవాణా శాఖామంత్రి శ్రీ చేబ్రోలు హనుమయ్య గాంధిస్మారక తపాలా బిళ్ళలను విడుదలచేశారు. హరిజన సంక్షేమ శాఖామంత్రి శ్రీ మహేంద్రనాథ్ 'హరిజన సంక్షేమ సమాచారము' మాస పత్రికను ఆవిష్కరించారు. పెక్కు సమావేశాలలో ప్రభాకర్‌జీ, శ్రీ కోదాటి నారాయణరావు మున్నగు సర్వోదయ నాయకులు పాల్గొన్నారు.

**ఆంధ్రప్రదేశ్ సూపర్ ఎక్స్‌ప్రెస్ :**

గంటకు 110 కిలోమీటర్ల వేగంతో 23 గంటలలో సికిందరాబాదునుండి ఢిల్లీచేరే ఆంధ్రప్రదేశ్ సూపర్ ఎక్స్‌ప్రెస్‌కు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు అక్టోబర్ 3 వ తేదీన పచ్చజండా చూపారు. ఇదివారానికి రెండుసార్లు ప్రయాణం చేస్తుంది. ముఖ్యమంత్రి దక్షిణ మధ్య రైల్వేను, దాని జనరల్ మేనేజర్ శ్రీ ఎస్. రాజన్‌ను అభినందించారు. ఎక్స్‌ప్రెస్ రైళ్ళవల్ల తపాలాశాఖ సేవ మరింత చురుకుగా సాగుతుందని పోస్ట్‌మాస్టర్ జనరల్ శ్రీ పి. ఎస్. రాఘవాచారి అన్నారు.

**ఉ ప శ్రు తి :**

"ఇప్పటికి నిశ్చింతగా ఉన్నానోయ్" అన్నాడు ఒకప్పుడు మునిసిపల్ సభ్యుడుగా కౌన్సిళ్ళ వెలిగించిన మిత్రుడొకడు, "ఎందుకు ?" అన్నాను. "పార్లమెంటు సభ్యులకు, విధాన సభ్యులకు పింఛను వచ్చింది. మాకూ, పంచాయతీ సభ్యులకూ వస్తుంది. నిశ్చింతకాక మరేమిటి?" అన్నాడు మిత్రుడు.

— తిరుమల రామచంద్ర

మూగదాన్ని పేరు తెచ్చుకున్నాను. ఈ పోలిక మాత్రం వాడికి అచ్చుగుద్దినట్లు వచ్చింది. నిజంగానే మూగవాడయ్యాడు. తండ్రి పోలిక తెచ్చుకున్న నేను ఇంత అదృష్టవంతురాలినైనాను. తల్లి పోలిక తెచ్చుకున్న వీడెంత అదృష్టవంతుడౌతాడో! ఇంక అమ్మా అనే పిలుపుకీ, నాకూ చాలా దూరం. ఇట్సాల్ రైట్ డాక్టర్."

ఈ మాటలన్నీ సరిత పైకి అనలేదు. మౌనంగా కన్సల్టింగ్ ఫీజు పదిరూపాయలు డాక్టరుకి అందించి, యాంత్రికంగా "వస్తాను డాక్టర్" అని చెప్పి, కొడుకు నెత్తుకుని బయటకు నడిచింది.






# గొడుగు



నల్లగా నలుమూలలా విస్తరిస్తున్న మబ్బులు- అంతవరకు వేడి వెదజల్లిన ఎండనుండీ భూదేవికి రక్షణగా గొడుగు పడుతున్నాయి.

చిక్కబడుతున్న చీకటిని చెండాడుతూ విర్రవీగి పోతున్నాయ్ మెరుపులు.

మెరుపుల పెదవుల నుండీ దూసుకు వస్తున్న గర్జనల్లా గూబలదరగొడుతున్నాయి ఉరుములు.

చల్లగాలి వళ్ళు విరుచుకుని ధూళి, ధూసరాలలో ఖేల మాడుతోంది.

ఆ ఇంటి కిటికీ రెక్కలమీదికి కూడ ఆ గాలిలోని ఉల్లాసం ప్రసరించింది.

ఆ చిరుసవ్వడికి కేశవరావు మాస్టారు తృళ్ళిపడి కళ్ళు తెరిచారు.

అలవాటుగా ఆయన కళ్ళు గోడగడియారం మీదకు మళ్ళాయి. నీరసంగా కదుల్తోంది లోలకం. బలహీనుడి గుండెలా మ్రోగుతోంది! కాలం కాళ్ళు నాలుగంకె మీద ముడుచుకున్నాయి.

ఆవలింత బద్ధకాన్నీ, వళ్ళువిరుపు నిద్ర మత్తునీ పంచుకోగా, తేటపడిన కళ్ళతో బానికేసి నడిచాడాయన.

కళ్యాణి, రామం ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

ఇద్దరి కళ్ళలోనూ వానభయం ఉంది.

వాకిలి వారగా, గోడకున్న పెద్దమేకుకి వ్రేలాడుతోంది తండ్రి గొడుగు. కష్టాలతో చివికి, పెనుగాలులకు చిరిగి, అతుకులతో బీదబ్రతుకుకి ప్రతీకగా ఉంది.

"వెధవ వాన యిప్పుడే రావాలా మరేం పని లేనట్టు ... ఈ రోజు ఫుల్ డ్రెస్ రిహార్సల్ కూడాను. ఇక టౌను హాలు కెళ్ళినట్లే" రామం కిటికీ లోంచి దర్శన మిస్తున్న ఆకాశాన్ని చూస్తూ గొణుక్కున్నాడు:

"ఉండరా నీ కెప్పుడూ నాటకాల పిచ్చి. నా కసలు ప్రైవేటు క్లాసుంది. పోర్షన్లు మిగిలిపోయేయి. ఓ పక్క పరీక్షలు వెన్నుమీద తంతున్నాయ్. అసలే ఫైనలియరు." కళ్యాణి మొహ మంతా దిగులు నింపుకుని అన్నమీద విసుక్కుంది.

"హు...పిచ్చిదానా...చదువులో ఏముందే చట్టుబండలు ? జీవితమంటే – ఏ ప్లస్ బి హోల్ స్క్వేర్ కాదు...ఏ మైనస్ బీ హోల్ స్క్వేరు ! ఏ బీలు రెండు రెట్లు మైనసయితే గానీ ఆన్సర్ రాదు ఇక్కడ మనిషి ఆశలకి రెట్టింపు నిరాశ కలిస్తేనే గానీ జీవితం గడవదు ... చూస్తూండు ... యీ నాటకాలే నన్ను ఒకరోజున తారాపథంలో కూర్చోబెడతాయి. మా నాటకం చూట్టానికి ప్రముఖ దర్శకులందరకూ ఆహ్వానాలు పంపాం. వాళ్ళొస్తారు మన 'టాలెంటు' నచ్చిందా...అక్కడతో జీవితం మలుపు తిరిగినట్టే...నీ అన్నయ్యగా నన్ను చెప్పుకోవటానికి నీ వళ్ళు గర్వంతో గగుర్పొడుస్తుంది."

గొంతు సరిచేసుకుంటు దొడ్లోంచి లోపలికు వస్తున్న తండ్రి అడుగుల శబ్దం



## రూ. 600 లు బహుమతి పొందిన కథ

విన్పించగానే నిశ్శబ్దంగా ఉండిపోయేడు, శ్యామం.

భార్య యిచ్చిన కాఫీ తాగి, కేశవరావు చొక్కా వేసుకున్నాడు.

అంతవరకు బట్టబయలుగా ఉన్న బనీను చిరుగుని చొక్కా దాచేసింది. చొక్కా కాలరు కూడ పిగిలి, పీచులాలేచి, గట్టానికి బాగా లేదు. ఆ చొక్కాని ఉతికినప్పుడల్లా కళ్యాణి ఏదో 'రి పే రు' చేస్తూనేఉంది. కొత్తగా ఏర్పడే చిరుగులు మామూలే!

"ఇంకో చొక్కా కుట్టించుకోకూడదా నాన్నా?" అంటే — తన మొహంకేసే చూస్తూ "కుట్టించుకుంటానమ్మా...తప్పక కుట్టించుకుంటాను. మనింట్లో పెళ్ళి సందడి రోజున మాత్రం యీ చొక్కా వేసుకోనులే సరేనా?" నవ్వేలాడు.

కళ్యాణి స్తబ్దంగా ఊరుకుంటుంది.

ఆమెకి తెలుసు.

చిరిగిపోయిన చొక్కాకంటే — తనపెళ్ళి ఆయన మనసులో ఎక్కువ అలజడి కల్గిస్తోందని.

ఏం చేయగలదు తను మాత్రం?

చదువు పూర్తయి బియ్యే అన్పించుకున్న అన్నయ్య మాత్రం ఏం చెయ్యగల్గుతున్నాడు?

తనకి సంసారబాధలమీద అవగాహనఉంది.

బాధ్యతల పట్ల గౌరవం ఉంది.

అన్నయ్యకవి లేవు.

నాటకాలాడుతూ — సినిమా జీవితాల గురించి రంగుల కలలు కంటు కాలాన్ని వ్యర్థం చేస్తుంటాడు.

తండ్రి చెప్పినంత కాలం చెప్పి, చివరకు గాలికి విడిచేశారు.

గొడుగు చేతిలోకి తీసుకుని, జేబులో కళ్ళజోడు వుందో లేదో తడిమి చూసుకున్నాడు కేశవరావు. కలంకోసం వేళ్ళు వెతుక్కున్నాయి. సంతృప్తిగా తల పంకించి, చెప్పుల్లో కాళ్ళు దూర్చాడు.

బయట వుండీ, వుండీ ఒక్కో చినుకు బరువుగా రాలుతూ, రానున్న పెద్ద వానకు సూచన యిస్తోంది.

నల్లటి శ్రావణ కన్య నింగినుండీ హేలగా విసుర్తున్న పేరంటం శనగల్లా కన్పిస్తున్నాయి వాన చినుకులు.

ఆమె నడుముకి చుట్టుకుంటున్న వంకెల వడ్డాణంలా మెరుపులు మెరిసిపోతున్నాయి.

"వస్తావా అమ్మా-అందాకా తీసుకెళ్ళి దింపుతాను?" అడుగు బయటకు వెయ్యబోతూ అడిగేడు కేశవరావు.

నవ్వొచ్చింది కళ్యాణికి.

ఆ గొడుగులో ఒక్కరు వెళ్ళినా తడవక తప్పదు. ఇద్దరు వెళ్తే చెప్పనక్కర్లేదు!

"వుపయోగం లేదు నాన్నా! ఆ గొడుగు మీకే చాలదు...గట్టి వానకి ముడిచి, నడవాల్సిందే..."

కేశవరావు కూతురు కళ్ళలోకి సూటిగా చూసేడు.

అంతలో, అతని పెదవులమీద నవ్వు మెరిసింది.

గొడుగుకేసి ఆప్యాయంగా చూసి, ప్రేమగా చేత్తో తడిమాడు.

"నిజమే నమ్మా! ఈ గొడుగు వయస్సు మీ కంటే చాలా ఎక్కువ. నాకు టీచరు పోస్టు దొరికిన రోజున కొన్నానిది. అప్పటికి నాకు పెళ్ళే కాలేదు. ఇప్పుడు ఎదిగిన యిద్దరు బిడ్డల తండ్రిని. నా సర్వీసు, దీని సర్వీసు ఒక్కటే! అందుకే యిదంటే నాకు అపేక్ష ఎక్కువమ్మా...దీన్ని చూసుకుంటుంటే నన్ను నేను అద్దంలో చూసుకుంటున్నట్టే ఉంటుంది. గడచిన రోజులన్నీ కళ్ళముందు కదుల్తాయి. ఇందులో ఒక్కొక్క కుట్టు కొక కథ ఉంది. దీని చిరుగులన్నీ స్వయంగా నా చేత్తో ఎందుకు కుట్టుకుంటానో తెలుసా? అలా కుట్టు కుంటూ అక్కడ ఒక స్మృతిని ముడివేస్తాను." కళ్ళు చెమరుస్తున్న అనుభూతితో ఆవేశంగా చెబుతున్న తండ్రికేసి విభ్రమంగా చూస్తుండి పోయింది కళ్యాణి.

అంతలోనే తమాయించుకొని, నవ్వటానికి ప్రయత్నిస్తూ "వెళ్దాం పదమ్మా! మళ్ళా వానొస్తే యిబ్బంది..." అడుగు బయటకు వేసి గొడుగు తెరిచాడు.

కళ్యాణి చప్పున గొడుగు క్రిందకి వెళ్ళి నిలబడింది.

ఓ అడుగు వెయ్యగానే ఆగి, ఏదో గుర్తు వచ్చినట్లు "నాన్నా! అన్నయ్య టౌనుహాలు కెళ్ళారిట ..." అంది తండ్రి మొహంలోకి చూస్తూ.

"రమ్మను..." అన్నాడు కేశవరావు.

"రారా...అన్నయ్యా!"

రామం వచ్చి చేరాడు.

ముగ్గురూ ముందుకి కదిలారు.

వాన చినుకుల సంఖ్య పెద్దదవుతోంది.

ఆకాశం ఆడపెళ్ళి వారిల్లులా హడావిడిగా ఉంది.

"మొన్న వెళ్ళొచ్చిన ఇంటర్వ్యూ సంగతేమైందిరా, రామం? జవాబేమన్నా వచ్చిందా?"

పేలవంగా నవ్వి "అలాంటి నాటి సమాధానాలు తొందరగానే వస్తాయి నాన్నా!" అన్నాడు.








ఓహో గంగాబవాని దీపావళి చేసుకుంటోందా ?

"ఏమన్నారు ?"

"ఇవ్వలేక పోతున్నందుకు విచారం వెలిబుచ్చారు !"

"నీ బోనసులు ట్రిప్పులు యిప్పట్లో పూర్తికావను కుంటాను ..." వ్యంగ్యం మేళవించి అన్నాడు, కేశవరావు.

"ఈ రోజు చివరి రిహార్సలు! ఎల్లుండే నాటకం...సినిమా డైరెక్టర్ని జడ్జీలుగా పిలుస్తున్నారు..." దాచుకోలేని సంబరంతో చెప్పాడు.

కేశవరావు అనాసక్తంగా విని, మౌనంగా నడవసాగేడు.

వాన మొదలైంది !

* * *

"అంతలా జల్లు పడుతుంటే, తడుస్తు కిటికీ దగ్గర నిలబడ్డారేమిటి నాన్నా! యీ టవలుతో తుడుచుకోండి ..." కళ్యాణి మాటలకి ఉలిక్కిపడ్డాడు కేశవరావు.

యాంత్రికంగా టువాలు అందుకుని తడి అద్దుకున్నాడు.

"ఏమిటి అదోలా ఉన్నారు నాన్నా ?" పరధ్యానంగా ఉన్న తండ్రికేసి చూస్తు అడిగింది కళ్యాణి.

ఉలిక్కిపడి — "ఎలా ఉన్నానమ్మా ?" అన్నాడు కలవరపాటు కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తు.

"ఏదో పోగొట్టుకున్నట్టుగా ... అన్నట్టు మీ గొడుగేది నాన్నా ?" కళ్లలో ఆటు,

## గొడుగు

యిటు వెతుకుతు అడిగింది.

"గొడుగు నిక్షేపంలా వుందమ్మా! నేను పోగొట్టుకున్నది అంతకంటే విలువైనది.."

"ఏమిటి నాన్నా అది ?"

"మాస్టరు గిరి! రేపే నేను రిటైరవుతున్నానమ్మా..." ఎంత నిగ్రహించుకుందా మనుకున్నా స్వరాన్ని ఛేదిస్తూ విన్పించింది జీర.

"మీరేం దిగులుపడొద్దు నాన్నా! మీకు ప్రైవేట్లున్నాయికద? నాకూ నాలుగైదు ప్రైవేట్లు కుదర్చండి. ఇద్దరం కలిసి సమర్థించుకొద్దాం..." కేశవరావు ఎదలో పితృప్రేమ పొంగి పొర్లింది.

కళ్లు తుడుచుకుంటు— "నువ్వు కొడుకుగా పుట్టి వుంటే నా జన్మ ధన్యమయ్యేది తల్లీ...అంత మాటన్నావు చాలు. ఆ నాలుగు ప్రైవేట్లూ నేనే చెబుతాను...నాలో యింకా జవసత్వాలుడిగి పోలేదమ్మా! బ్రహ్మదేవుడు బడిపంతుళ్ళకి ముందుగానే గట్టి శరీరాలిచ్చి పంపిస్తాడు" నవ్వాలని ఓడిపోయి, మొహం చాటు చేసుకున్నాడు.

"మేం పెరిగాం కద నాన్నా! ఇప్పుడు మీరు మాకు పసిపాపలు...మేం ఎలా చెబితే అలా నడుచుకోవాలి. నా పరీక్షలు అయిపోయాయి గనుక- యికనుంచీ నేను మీకు సాయం చేస్తాను వద్దంటే ఊరుకోను.."

"సరేనమ్మా.. నీయిష్టం"— ఈమాటు కేశవరావు మనస్ఫూర్తిగా నవ్వగలిగేడు.

"ముందు భోజనానికి పదండి.. మీకోసం అంతా ఎదురు చూస్తున్నాం..."

"వెళ్దాం పద..." వంటింటికేసి నడిచారు, బరువుగా నిట్టూరుస్తు.

* * *

"ఛీ ఛీ.. యీ వెధవ నాటకాల జోలికసలు వెళ్లకూడదు..." రామం నాటకం స్క్రిప్టుని గోడకేసి కొట్టాడు; అడుగు లోపలికి వేస్తూనే.

"ఏమైందిరా?" అంది కళ్యాణి ఆశ్చర్యపోతు.

"ఎక్కడ చూద్దామన్నా కుట్ర, కుతంత్రమే. లాలూచీలుపడి తమ కిష్టమైన వాళ్లకి ఉత్తమ నటుడు బహుమతి ఇప్పించుకున్నారు. అందుకే తెలుగు దేశంలో నాటకాలిలా అధోగతిలో పడ్డాయి..." కసిగా అన్నాడు.

"అలా నిరాశ చెందకూడదు నటశేఖరా! తమరికి వుజ్వల భవిష్యత్ గేవా కలర్ సినిమా స్కోపులో ఎదురు చూస్తోంది. ఇంకా క్లోజప్ కావడానికి టైము రాలేదంతే..." నవ్వు దాచుకుంటూ అంది.

కోపంగా చూసేడు చెల్లెలివంక.

గలగల నవ్వేసింది; కళ్యాణి.

"నేనంటే నీకంత తమాషాగా వుంది కదు?" వుడుక్కుంటు అన్నాడు.

"లేకపోతే ఏమిట్రా? ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు. ఈ యింటికంతకీ ఒక్క గొడుగు ఎలాగో- మనందర్నీ పోషిస్తున్నది నాన్న ఒక్కరే! నువ్వున్నావంటే బి య్యే చదివి నాటకాలరాయుడి వయ్యావ్...!"

"ఇదుగో అట్లాంటి మాటలంటేనే నాకు వళ్లు మండుకొచ్చేది. నేను ఉద్యోగాల కోసం ఏ ప్రయత్నమూ చెయ్యకుండా కూర్చున్నానంటావా ?"

నవ్వింది కళ్యాణి.

"ప్రయత్నంతో నాస్తి దుర్భిక్షమ్ — అనలేదు గీతాచార్యుడు. కృషిచెయ్యాలన్నాడు. కృషి అంటే ఆషామాషి ప్రయత్నాలు కావు. అహర్నిశలూ అదే లక్ష్యంమీద గురి ఉంచి సర్వశక్తులతో శ్రమించడం..."

"కృషి — శ్రమ — శ్రమ— ఏమిటి నువ్వు చెప్పే శ్రమ? మట్టి మొయ్యాలా, రాళ్ళు కొట్టాలా ?" కసిగా అరిచేడు.



"ఆ అవసరం వస్తే అదీ చెయ్యాలేమొ!"

"అలాంటి పనికి వేలుపోసి డిగ్రీలు చదవటందేనికీ – హాయిగా చిన్నప్పట్నుంచే తట్ట నెత్తికెత్తుకెళ్ళొచ్చుగా."

గొడుగు





నిట్టూర్చింది కళ్యాణి.

"నీకు శరీరం పెరిగింది కానీ మెదడు పెరగలేదురా! మనిద్దరికున్న ఏడాదిన్నర తేడా ఒక్కటే నీకు పెద్దవాడిగా ఆధిక్యత యివ్వకపోతే, నిన్ను శాసించి మరీ పనులు చేయించేదాన్ని. నాన్న రిటైరయ్యారే కుటుంబం ఎలా గడుస్తుందన్న ఆలోచనుందా నీ కసలు ?"

"నాన్న రిటైరయ్యారా ?!" నమ్మలే నట్లు చూసేడు.

"వారం రోజులవుతున్నా యీ సంగతి తెలియని ఘనుడివి నీ ఒక్కడివే! దీన్నిబట్టే నీ పరిస్థితి నువ్వు అర్థం చేసుకోవచ్చు..."

"నాకేం తెలుసు ? అయినా, నాముందు మాటవరసకన్నా అనుకోపోతే ఎలా - తెలుస్తుంది ? ఇంకా శలవులో ఉన్నారేమొ అనుకుంటున్నాను..."

"వెళ్ళరా...వెళ్ళి నీపని చూసుకో! నీతో వాదించి ప్రయోజనం లేదు. నాకు తలనొప్పి కూడ వస్తోంది. అమ్మ నీకోసం వంటింట్లో ఎదురుచూస్తోంది పో..." నేలతో నదురు గట్టిగా లదుముకుంది; కళ్యాణి

రాముం చెల్లెలికేసి లదోలా చూపి, వంటింటికేసి వెళ్ళేడు.

* * *

"అమ్మా, ఆ గొడుగిలా అందుకో సీతా పలిగారింటికి వెళ్ళొస్తాను ..." చెప్పులు తొడుక్కుంటూ కూతుర్ని అడిగాడు కేశవరావు.

"అన్నయ్య తీసుకెళ్ళాడు నాన్నా..."

"ఏమిటీ – వాడు తీసుకెళ్ళాడా ? నాగొడుగు ముట్టుకోవద్దని చెప్పిగుండాలు వాడికి. దాన్ని ముట్టుకోవద్దని నువ్వు చెప్పలా ? ఏమిటమ్మా యిది ... నువ్వు కూడా..." బాధ, కోపంతో ఊగిసలాడి పోతున్న తండ్రిని చూసి ఆప్యాయంగా నవ్వింది కళ్యాణి.

"వాడు యీరోజునుండీ నీ గొడుగుతో బాటు బాధ్యతలు కూడ తలకెత్తుకున్నాడు నాన్నా! ట్యూషన్ను అప్పే వాడే చెబుతానన్నాడు. ఉద్యోగం వచ్చేదాకా యింకొన్ని ట్యూషన్ను కూడ కుదుర్చుకుంటానన్నాడు."

"ఏమిటే ... యివన్నీ మన రాముం గురించేనా నువ్వు అంటున్నది ?" ఆశ్చర్యంగా పడక్కుర్చీలో కూలబడ్డాడాయన.



Interpub/GSC/2/76 Tel

# సింథాల్

## దుర్గంధాన్ని నిర్మూలించి తాజాదనం గల్గించే సబ్బు.




చమట వలన గలిగే శరీర దుర్గంధాన్నుండి శక్తివంతంగా కాపాడుతోంది.

ఏ సబ్బు పూర్తిగా వుంచనంత తాజాగా మిమ్ములను వుంచుతుంది.

సౌందర్య రక్షణకై చర్మ రోగ నిపుణులచే సిఫారసు చేయబడింది.

ప్రత్యేక సదుపాయం!

## సింథాల్ పై 30 పై. తగ్గింపు

స్టాకు వున్నంతవరకే పరిమితం గాన త్వరపడండి.

రూ 600 లు బహుమతి పొంధిన కథ

# ఫోటో

"యేవమ్మా! యింతాలస్యంగా వచ్చావ్" అడిగింది శాంతమ్మగారు నీరజని, డ్రాయింగు రూములోకి వస్తూ

"లేదండి బామ్మగారూ! కాలేజిలో యేదో మీటింగంటే వుండిపోవాల్సి వచ్చింది." అంది నీరజ ఫ్లాస్కులోని కాఫీ రెండు కప్పుల్లో పోసి ఆమె కొకటి యిచ్చి తనొకటి తీసుకుంది.

''యేంటోనమ్మా అటు పట్నం కాదు, ఇటు పల్లె కాదూ! మంచి ఊళ్ళో పడ్డావు జూనియర్ కాలేజీ లెక్చెరర్‌గా'' అంది.

''తప్పదు కదండీ పొల నుద్యోగినికి దూర భూమి లేదు'' అంది నవ్వుతూ నీరజ, టేబిల్‌మీద నున్న ఫొటో ఆల్బమ్ ఆమె చేతి కిస్తూ.

ప్రతీ రోజూ శాంతమ్మ ఫొటో ఆల్బమ్ కోసం వీధి కొసలో నున్న నీరజ యింటికి వస్తుంది పక్కగా ఆకుపచ్చని రంగులో బంగారం రంగు లతలతో ముచ్చటగా వున్న ఆ ఆల్బం, అందులో ఫొటోలు అంటే యెంతో యిష్టం రోజూ తనివితీరా చూసి వెళ్ళటం ఆమె దైనందిన కార్య క్రమాలలో వొకటి.

''అమ్మాయ్. నువ్వెన్నిసార్లు యిప్పటికి ఫొటోలో దిగివుంటావ్'' అడిగింది ఫొటో ఆల్బమ్ తిప్పుతూ. నీరజ కిలాంటి ప్రశ్నలు మామూలే.

''చాలాసార్లు దొడ్డమ్మగారు! లెక్కపెట్ట లేదు'' అంది నీరజ. కుక్కర్ పొయ్యిమీద పడేస్తూ. శాంతమ్మగారు వొక్కొక్క పేజీ తిప్పుతూ వొకచోట ఆగిపోయింది

''యేంటండీ అంత దీక్షగా చూస్తున్నారు?'' నీరజ ప్రశ్నించింది.

''యేం లేదమ్మా. ఈ ఫొటోలో నువ్వెంత బాగున్నావో! రంగు రంగుల చుక్కల చీర, పట్టు రవికె. నిజంగా రతీదేవిలా వున్నావు. అమ్మాయి ఈ రంగులు ఫొటో తీసిన తరువాత వుంటాయా?'' అమాయకంగా అడిగింది శాంతమ్మ. నీరజకు నవ్వు వచ్చింది.

''లేదండీ! మీకు చెప్పే వుంటాను. మా అక్కయ్య జపాన్‌లో వుంటోందని, అది ఇండియా వచ్చినపుడు తన కెమెరాతో ఫొటో తీసి అక్కడ డెవలప్ చేసి కాపీలు పంపించింది'' అంది నీరజ.

''నువ్వు చాలా అదృష్టవంతురాలివమ్మా'' అంది శాంతమ్మ దీర్ఘంగా నిట్టూరుస్తూ.

''ఫొటోలు తీసుకోవటంగూడా వొక అదృష్టమేనా దొడ్డమ్మగారూ'' అడిగింది నీరజ.

''నిజమేనమ్మా! కొన్ని కొన్ని కొందరికి అనుకోకుండానే లభ్యమవుతాయి కొన్ని కొన్ని కొందరు ప్రయత్నం ద్వారా సాధించుకుంటారు కొందరు కొన్నిటిని యెంత ప్రయత్నించినా లభ్యము కావు. నా చిన్నప్పట్నుంచీ ఫొటో తీయించుకోవాలన్న కోరిక యెడారిలో యెండమావిలా మిగిలి పోయింది వయస్సు మళ్ళిపోయింది ఊరు పొమ్మంటూంది. కాడు రమ్మంటోంది. ఈ వొక్క కోరిక జీవితంలో తీరదేమోననిపిస్తుంది తల్లీ'' అంది శాంతమ్మగారు ఆమె నుదుటి మడతలు జీవితంలోని అనుభవాల దొంతర్లను గుర్తుకు తెస్తున్నాయి

నీరజకు తెలుసు అతి సామాన్యమైన ఆమె కోరిక. ఆమె కోరిక తీర్చుకోలేని వలయంలో వుంది అందుకనే ఆమె తన ఆల్బం చుట్టూ తృప్తి అనే వల అల్లుకుంది. ఆ ఆల్బమ్ ఆమె కోరికను తృప్తిగా ఓదారుస్తుంది. ప్రతీ ఫొటోలోనూ, తనే అందులో వున్నంత తృప్తిగా భ్రమతో ఆమె బ్రతుకుతోంది.

తల్లిలేని నీరజకు శాంతమ్మగారంటే మంచి అభిమానం. తనింకా కొత్తగా ఉద్యోగంలో జాయినయి, వారం రోజులు కాలేదు. శాంతమ్మగారు ప్రియబాంధవిలా తయారయి చిన్న చిన్న పనిపాటలు చేస్తూ కష్టసుఖాలకు అయ్యేది. వీధి చివర్న కన్నకొడుకూ, కోడలు ఇద్దరు మనవలూ దుర్భర





మైన దరిద్రం ఆమె సంసారం. కొడుకు సమితి ఆఫీసులో గుమస్తా. పేకాట తప్పించి, ఆఫీసు పని యెప్పుడు చేస్తాడో పరమాత్ముడికి తెలుసు. కోడలు పనిమనిషికన్నా హీనంగా నానా చాకిరీ చేయించుకుని, యింత అన్నం పడేసేది. శాంతమ్మగారికి, ఆ యింట్లో పని చేస్తున్నంతవరకూ, యిలాంటి ఊహలు దరిదాపుల్లోకి రావు. యాదృచ్ఛికంగా పరిచయమైన నీరజ యింట్లోనే, ఆమెకు మానసికమైన విశ్రాంతి దొరుకుతోంది.

''యేమిటమ్మా అంత ఆలోచిస్తున్నావ్ ? నిన్ను మరీ మరీ రోజూ యిలా వచ్చి విసిగిస్తున్నానా తల్లీ'' అంది

''లేదండీ దొడ్డమ్మగారూ ! మీరు జీవితంలో చాలా భాగం నడిచి వచ్చేసారు. సుమారు ఈ యేభై యేళ్ళలోనూ, ఫొటో తీయించుకోవడానికి గూడా అవకాశం రాలేదా ?''

''ఎందుకు రాలేదమ్మా ! అవకాశాలు వున్నంత మాత్రాన చాలదమ్మా. అదృష్టంగూడా దానితో స్నేహం చేయాలమ్మా !'' అంది శాంతమ్మగారు బాధగా.

''అంటే...'' ప్రశ్నించింది నీరజ.

''నాది చిన్నప్పట్నించీ దురదృష్ట జాతకమేనమ్మా ! పదో సంవత్సరంలో ఆ పల్లెటూళ్లో, నా తల్లి పోయింది. మా అమ్మ బ్రతికివుండేటప్పుడల్లా, మా నాన్నతో పట్నం తీసుకెళ్లి నాకు ఫొటో తీయించమని శతవిధాల పోరేది. కాని మా నాన్న అదిగో ఇదిగో అనంటూ వాయిదా వేసేసాడు మా అమ్మ పోయిన రెండు నెలలు లోగానే మా నాన్న పెళ్లి చేసుకున్నాడు ఆరోజు ఫొటోగ్రాఫరు పెళ్లి పందిట్లోకి వచ్చాడు యెంచక్కా మా నాన్నకీ, పిన్నికీ ఫొటోలు తీసాడు ఫొటో తీస్తుంటే నేనుగూడా చక్కగా సర్దుకుని, మా పిన్ని పక్కన నిల్చున్నాను. '' కాస్సేపాగింది శాంతమ్మ.

''ఏం ఆ ఫొటో బాగా రాలేదా ?''

'ఫొటో చాలా బాగా వచ్చిందమ్మా ! కాని అందులో నేను లేను. మా పిన్ని అత్తగారు, బలవంతంగా తాటకిలా నన్ను మా పిన్ని పక్కనుండి లాగేసి -''తల్లిని మింగినదానివి నువ్వెందుకే శకున పక్షిలా !'' అంటూ నెత్తిన మొట్టికాయ పెట్టింది.

''పోనీ ఆ తర్వాతయినా మీ నాన్నగారితోగానీ, పిన్నిగారితోగానీ చెప్పి తీయించుకోలేకపోయినారా ?'' అడిగింది నీరజ జాలిగా.

''అదిగూడా నాకు కుదరలేదమ్మా ! పెళ్లయిన తరువాత మా నాన్న మా పిన్ని వలలో పడిపోయాడు నాకు మా పిన్ని చదువు మానిపించేసి ఇంటి ఇంటెడు చాకిరీ నామీద రుద్దేసి యిన్ని గంజినీళ్లు పోసేది '' శాంతమ్మగారి కంఠం రుద్ధమయి పోయింది. గుండె బరువెక్కిపోయింది.

''పోనీలెండి దొడ్డమ్మగారు ! యింకోనాడు చెబుదురుగానీ మీ మనస్సు బాగులేదేమో.. ''

''లేదమ్మా ! జ్ఞాపకాలు అనుభవాలు వెనక్కి వెడుతున్నాయి. సింహావలోకనం చేసుకుంటున్నాను జీవితాన్ని ఆ బానిస బ్రతుకులో ఫొటో కోరిక పెళ్లి వరకూ సజీవ సమాధి చేసుకున్నాను.''

''మీ కోరిక పెళ్లిరోజు గూడా తీరలేదా ?'' ఆత్రుతగా అడిగింది నీరజ.

''నువ్వు నా కూతుర్లాంటిదానివి తల్లీ ! అప్పటి విషయాలు తల్చుకుంటే వొళ్ళు జలదరిస్తుంది. నా తండ్రి పోయిన సంవత్సరంలోనే నా సవతితల్లి, డబ్బు కాశపడి వొక వ్యసనపరుడికి, కొంచెం వయసు మళ్లినాయనకు చేసింది. పెళ్లిలో ఆయన తలంబ్రాలు పోస్తున్నపుడూ మంగళసూత్రం కడుతున్నప్పుడూ ఫొటోలు తీస్తారేమోననుకున్నాను కానీ తీయలేదు. పెళ్లయిన తరువాత గూడా ఏనాడు ఆయన సమంగా యింటికి రాలేదు. ఆయన వివిధ భంగిమల్లో వుండే ఫొటోలు, ఆ యింట్లో వుండే రామాయణాది గ్రంధాలు, నా వొంటరితనాన్ని కొంతవరకూ తొలగించేవి. భార్య అంటే పురుషుని కామానికి బలియైన ఆటవస్తువుగానే ఆయన చూసేవారు. అన్యోన్యాలూ, అభిమానాలు, ఆప్యాయతలు, యిలాంటివేం లేవు మా యిద్దరిమధ్య అయినా వొకసారి సిగ్గువిడిచి నా కోరికను ఆయనకు చెప్పాను.

''నీ దరిద్రం మొఖానికి ఫొటో వొకటే తక్కువ.'' అంటూ నానాతిట్లు తిట్టారు ఆయన ఆరోగ్యంతోపాటు, ఆస్తి హారతికర్పూరంలా కరిగి పోయింది ఒకనాటి రాత్రి, తెల్లవారుఝామున నన్ను, ఆర్నెల్ల పసిగుడ్డుని విడిచి గుండెనొప్పితో చచ్చిపోయారు '' శాంతమ్మగారి కంటి నుండి అశ్రుకణాలు రాలాయి. నీరజ విచలితురాలైంది కాస్సేపాగి కళ్లు తుడుచుకుని ప్రారంభించింది, శాంతమ్మ

''ఆయన పోయారన్న బాధ, బ్రతుకుమీద భయం, ఆర్నెల్ల పసిగుడ్డు వాని భవిష్యత్తు ఇవన్నీ నా వొంటిమీద తెలివిలేకుండా చేసాయి బ్రతికి వున్నపుడు ఆయన సొమ్ము తిన్నవారందరూ వచ్చారు చివరిసారి సాగనంపడానికి ఘనమైన ఏర్పాట్లు చేసారు. నన్ను పక్కన నిల్చోబెట్టించి, శవానికి స్నానం చేయించారు. ఎవరో ఫొటోగ్రాఫరు వచ్చి ఫొటో తీసే సమయానికి, మరొక స్త్రీ హఠాత్తుగా గుండెలు బాదుకుంటూ వచ్చి, నా స్థానాన్ని ఆక్రమించేసింది ఇంతలోనే కెమేరా క్లిక్ మంది.'' అంది శాంతమ్మగారు.

''ఎవరండీ ఆమె ?'' అడిగింది నీరజ.

''ఎవరంటే ఏం చెప్పను తల్లీ ! నాపాలిట శని. నా బిడ్డడి పాలిట దురదృష్టదేవత, ఆయన వుంచుకున్న స్త్రీ, ఆయన బాగా తాగి వున్నప్పుడు నంగనాచి మాటలాడి, మిగిలిన ఆస్తిపాస్తులు వీలునామా వ్రాయించుకుంది.'' అంది బరువుగా

''నాన్నమ్మా ! నానమ్మా యిక్కడున్నావా ! అమ్మ నీకోసం బొబ్బలుపెడుతూ తిడుతున్నది తొందరగా రా !'' అంటూ, రెండో మనవడు చెప్పి పరిగెట్టి, వెళ్లిపోవటంతో ఆ ప్రసంగం అక్కడికి ఆగిపోయింది 'వస్తానమ్మా' అంటూ లేచి వెళ్లిన శాంతమ్మగారివేపే చూస్తూ వుండిపోయింది నీరజ

*     *     *

శాంతమ్మగారంటే సహనానికి మారుపేరు భర్త పోయిన తరువాత వాళ్లింటా, వీళ్లింటా నీరు మోసి, చిన్న చిన్న పనులు చేసిపెట్టి కొడుకుని వాళ్లింటి దగ్గరా, వీళ్లింటి దగ్గరా, వారాలు యిప్పించి, స్కూలుఫైనలు చదివించింది వాళ్ల కాళ్లు, వీళ్ల కాళ్లు పట్టుకుని, కొడుక్కి సమితి ఆఫీసులో ఉద్యోగం వేయించింది మంచి కట్నంతోనే పెళ్లి చేసింది కొడుక్కి కొడుకు పెళ్లి పందిట్లో గూడా ఆమె కోరిక తీరలేదు

''శుభమా అంటూ వాళ్లిద్దరూ చిలకా గోరింకల్లా ఫొటోలు తీయించుకుంటే, జుట్టులేని వాళ్లం మనమెందుకండీ, అశుభంగా వాళ్ళ పక్కన నిలబడటం వొదినగారూ !'' అంటూ వియ్యపురాలు తన కోరికను కాలబెట్టి నేల రాసేసింది కొడుకు వినిగూడా అత్తగారి మాటలకు ఎదురు చెప్పలేనంత అశక్తుడయిపోయాడు. ఆ తర్వాత వొకటి రెండుసార్లు కొడుకూ, కోడలు పట్నం వెళ్లి పిల్లలతో ఫొటోలు తీసుకుని వచ్చేసారు కానీ శాంతమ్మగార్ని తీసుకువెళ్లలేదు. ఇలా ఆమె కోరిక ఎన్నిసార్లు దగ్ధమయిందో అంచెలంచెలుగా తెలుసుకుంది నీరజ.

శాంతమ్మగారు ఏనాడూ యిది కావాలనిగానీ అడగలేదు నీరజ కాలేజీకి బయల్దేరబోతున్న



సమయంలో వొకనాడు పదిరూపాయలు కావాలని వచ్చింది.

"ఎందుకండీ దొడ్డమ్మగారు!" అంటూనే యిచ్చింది.

"ఏం చెప్పనమ్మా! వాడెక్కడ పేకాటలో కూర్చున్నాడో రెండురోజులుగా ఇంటికేనా రాలేదు కోడలుకు జ్వరం. ఇంట్లో బియ్యంగింజలు లేవు అందుకని..." అంటూనే తొందరగా వెళ్లిపోయింది.

* * *

"దొడ్డమ్మగారూ! మీకో శుభవార్త." అంది నీరజ వొకనాటి సాయంకాలం. అల్బం మాస్తున్న శాంతమ్మగారు ఆనందంగా తల యెత్తింది.

"నాకు తెలుసునమ్మా నీవు చెప్పబోయే శుభ వార్త."

నీరజ ఆశ్చర్యపోయింది.

"నేను చెప్పకుండానే మీకెలా తెలుసండీ" అడిగింది ఆత్రుతగా.

"ఈ ఫొటో ఆల్బమ్‌లో యింకా చిన్న కోరిక మిగిలిపోయిందమ్మా. నీవు పెండ్లి చేసుకుని ముచ్చటగా, ఆ కల్యాణ సందర్భంలో నీవూ, మీ ఆయనా తలంబ్రాలు పోసుకునేటప్పుడు, యింకా చాలా చాలా సందర్భాలలో పెండ్లి ఫొటోలతో ఈ ఆల్బం నింపాలి. ఆ శుభవార్త కదమ్మా నీవు చెప్పదల్చుకున్నావు" అంది శాంతమ్మగారు నవ్వుతూ.

నీరజ బుగ్గల్లో యెరుపుదనం వచ్చింది. సిగ్గుతో మొగ్గయి పోయింది.

"మీరెప్పుడు ఇంతేనండీ. అదిగాదు దొడ్డమ్మగారూ! ఇది మీకు సంబంధించిన శుభవార్త" అంది నీరజ.

"ఏమిటమ్మా అది?" ఆశ్చర్యంగా అడిగింది.

"మీరు రేపు నాతో పట్నం వస్తున్నారు" అంది నీరజ.

"ఎందుకమ్మా?"

"ఎందుకో అక్కడ చెబుతానులెండి"

"అలాక్కాదు చెప్పుతల్లీ!"

"ఈ ఊళ్లో యెలాగా ఫొటో స్టూడియో లేదు కదండీ. అక్కడ మీకు ఫొటో తీయిస్తాను. నాకు రేపు పట్నంలో కొన్ని కొనుక్కోవాల్సిన వస్తువులు వున్నాయి. మీరుగూడా వస్తే నాకు సాయంగానూ వుంటుంది. అదీగాక మీ చిరకాల వాంఛ తీరుతుంది" అంది నీరజ. శాంతమ్మ కళ్లు ఆనందంతో మిల మిల మెరిసాయి

"మా తల్లే .. వా ఆయుస్సు గూడ పోసుకుని వెయ్యేళ్లు వర్ధిల్లమ్మా... నాకు కన్నకూతురు లేని లోటు తీర్చావ్" అంటూ కళ్ల నీళ్ళు పెట్టుకుంది.

"ఉదయం ఫస్ట్ బస్సులో బయలుదేరుదాం. ఫొటో తీయించుకున్న తరువాత అన్ని పనులు మాసుకొని సాయంకాలం తిరిగి వచ్చేద్దాం సరేనాండి" అంది నీరజ మళ్లా దిగాలు పడి పోయింది శాంతమ్మగారు.

"ప్రే లాభం లేదమ్మా! వాళ్ళు పంపించరు నీతో."

"ఏం యెందుకండీ! మనం కొన్ని గంటలే కదా పట్నంలో వుండేది." ఆశ్చర్యంగా అడిగింది.

"కాదమ్మా! వాడే కళ నుండి వొప్పుకున్నా




"క్లాసులో గొడవ చేస్తుంటే, ఎండలో అరగంట గుంజీలు తియ్యమని పిల్లలందర్నీ బయటకు పంపేసా ... మీరేం చేస్తున్నారు??"

"ఒక్కక్షణం ఆగండి! మా వాళ్లందరి చేతా గోడకుర్చీలేయించి వస్తా — కాసేపు కబుర్లాడుకుందాం!!"

# ఫొటో

అదొప్పుకోదు. అందులో ఫొటో కంటె మరీ వొప్పుకోదు. ఇదివరలో కొడుకు కదా అని చనువుగా వొకటి రెండుసార్లు అడిగితే నీకు ఫొటో యెందుకమ్మా... అయినా పట్నం తీసికెళ్లాలి. చాలా డబ్బవుతుంది." అని కొడుకంటే —

"కాటికి కాళ్ళు జాచుకున్నారు. అన్నీ ఉడిగి పోయిన ఈ వయస్సులో మీ కెందుకండీ అత్తగారు ఈ ఫొటోల పిచ్చి" అని కోడలు ఈసడించేసిందమ్మా" అంది నిట్టూరుస్తూ.

నీరజ ఇరకాటంలో పడ్డాది

"అదిగాదు దొడ్డమ్మగారూ! ఫొటోకని చెప్పొద్దు తర్వాత చెబుదురుగాని. నాకు సాయం వస్తున్నట్లుగా చెప్పండి కావాలంటే నేను గూడా వచ్చి చెబుతాను." అని ధైర్యం చెప్పింది.

"అక్కర్లేదమ్మా నేనే అడుగుతాను..." అని ఫొటో ఆల్బమ్ నీరజ చేతికిచ్చి వెళ్లిపోయింది, కళ్లు తుడుచుకుంటూ.

* * *

ఉదయం యెప్పటికీ రాకపోతే, నీరజ శాంతమ్మ గారింటికి వెళ్లింది. గుమ్మం బయటనే యింట్లో నుండి పెద్ద కేకలు విన్పించాయి.

"అది రమ్మనటం, ఈవిడగారు తగుదునమ్మా అంటూ వెళ్లిపోవటం బాగుంది." కోడలు రంకెలు పెడుతోంది.

"నువ్వెళ్లిపోతే యిక్కడ పనులు అదొక్కర్తీ చేసుకోగలదే? అయినా యిప్పుడెందుకమ్మా పట్నం అంత అవసరం ఏమిటొచ్చింది." నిద్రమండి లేచినట్లుగా, బద్ధకంగా కొడుకు కంఠం విన్పించింది.

"ఏమున్నాయో యెవరికి తెలుసు. ఆ చదువుకున్న టక్కులాడితో ఈవిడగారు. ఆవిడగారికేం పనులున్నాయో" అని అరుస్తోంది కోడలు.

"మళ్లా సాయంకాలానికల్లా వచ్చేస్తామురా!" అని బ్రతిమాలుతోంది శాంతమ్మగారు.

"అలాగే అంటారు. బస్సు దొరకలేదని రాత్రిళ్లు లాడ్జీలు, అడ్డమైన తిరుగుళ్లు. ఆమెగారు చాలా పెద్ద గ్రంథకర్త అట. వయస్సు మళ్లిన పెద్దావిడ యెలాగా వుండాలి కదా" అంటోంది కోడలు మధ్య తరగతి కుటుంబానికి చెందిన మహిళ.

నీరజ ఆ మాటలకు కంపించిపోయింది కోపంతో ముఖం జేవురించింది. లోపలికి వెళ్లి కోడలుకు, జుత్తు పట్టుకుని నాలుగు తగిలిద్దామనుకుంది కానీ తమాయించుకుంది.

దరిద్రం వొక్కటే మధ్య తరగతి కుటుంబాలకు ఆభరణం కాదు. అసహనం, అసూయ, ద్వేషం, ఓర్వలేనితనం, అవివేకత, స్వార్థం, యివన్నీ వాళ్లకు అలంకారాలు శ్లేష్మంలో పడ్డ ఈగలు సంస్కారం యెక్కడనుండి వస్తుంది నీరజ కోపాన్ని తమాయించుకుంది.

"మీరు వెళ్లడానికి వీలులేదండి యింట్లో పనులు యెవరు చేస్తారండీ" అన్న కోడలు మాటలు తిరిగి వెళ్లిపోతున్న నీరజకు విన్పించాయి.

కొన్ని గంటలు పోయిన తరువాత శాంతమ్మగారు నీరజ దగ్గరకు వచ్చింది.

"యేవమ్మా నువ్వెళ్లలేదా?"

"లేదండీ! మీకోసం ఇంతసేపు చూసాను కానీ రాలేదు. నాకూ కొంచెం వొంట్లో నలతగా వుంటే మానేసాను" అంది నీరజ పొద్దున్న కోడలన్న మాటలు నీరజకు మరింత బాధ కలిగిస్తున్నాయి.

"మా అబ్బాయితో నా ఫొటో సంగతి చెబితే యెంతో సంతోషించాడమ్మా. వాడ్నెందుకు శ్రమ పెట్టడం. నేనే తీయిస్తానన్నే వొకటి రెండు రోజుల్లో ఫస్ట్ తారీఖు యెలాగ వస్తుంది కదా." అన్నాడు తల్లీ అంది శాంతమ్మగారు ఆమె గొంతుకో తడి పొర జీర పలికించింది.

"నేనంతా పొద్దున విన్నాను, దొడ్డమ్మగారు" అంది నీరజ, హీనమైన కంఠస్వరంతో. శాంతమ్మగారు అప్రతిభురాలైపోయింది

"నీ మనస్సు యెక్కడ బాధపడుతుందోనని అలా చెప్పానమ్మా వాళ్లెంత నీచులంటే అంత నీచులు. వాళ్ల తరఫున నీకు జరిగిన అవమానానికి నేను క్షమాపణ చెప్పుకుంటున్నానమ్మా" అంది గాద్గదికంగా నీరజ రెండు చేతులు పట్టుకుంటూ.

"నన్నన్నందుకు ఏమీ బాధపడటం లేదు దొడ్డమ్మగారూ! మీ కోరిక ఇలాగైనా తీరనందుకు చాలా విచారిస్తున్నాను" అంది నీరజ.

"ఏం చేస్తామమ్మా! ఈ జీవితంలో యెంత చేసుకున్నామో అంతే ప్రాప్తం. అన్నట్లు నీ దగ్గర తీసుకున్న పది రూపాయలు ఫస్టు తారీఖున ఇచ్చేస్తామమ్మా." అంటూ వెళ్లిపోయింది కళ్ల నీళ్ళు వొత్తుకుంటూ.

హిమాలయమంత మనస్సుగల మనిషి. వీధిలో అందరి కష్టసుఖాలు తన కష్టసుఖాలుగా భావించే మానవతామూర్తి. ఫొటో తీయించుకోవాలనే సామాన్యమైన కోరికను యెవరి అభ్యున్నతికోసం నానా యాతనలు పడి, చదివించి, వొక వుద్యోగస్తుడ్ని, ఇంటవాడిని చేసిందో అతను తీర్చలేకపోయాడు. పేకాటలో వుండే ఆనందం తల్లి కోర్కె తీర్చటంలో అతను అనుభవించలేడు

ఆ పుణ్యాత్మురాలి కోరికను యెలాగైనా తీర్చాలన్న మంకుపట్టు నీరజ మనస్సులో తిష్టవేసుకుంది తెలిసిన లెక్చరర్ల ద్వారా లోడ్ చేయించిన చిన్న కెమేరా పట్నం నుండి తెప్పించింది. కనీసం ఇంట్లో నయినా శాంతమ్మగారి ఫొటో తీద్దామని.

* * *

తెల్లవారుఝామున తలుపు కొడుతూవుంటే నీరజ కళ్లు నులుముకుంటూ, లేచి తలుపు తీసింది. ఎదురుగా శాంతమ్మగారి కోడలు. ఆమె కళ్లు ఎర్రగా వున్నాయి.

"మా అత్తగార్కి అర్ధరాత్రి వెన్నెముకలో నొప్పి వచ్చింది. డాక్టరుగార్ని తెప్పించాం. పరిస్థితి ప్రమాదకరంగానే వుంది. అర్జంటు మందులు కొనమన్నారు; ఒక యేభై రూపాయలు అప్పుగా ఇవ్వండి. మళ్లా ఇచ్చేస్తాం" అంది. గుమ్మం బయట శాంతమ్మగారి కొడుకు నిల్చున్నాడు. నీరజ స్తబ్దురాలైపోయింది. క్రితం రోజు సాయంకాలం గూడా వచ్చి ఫొటో ఆల్బమ్ చూసి వెళ్లిపోయింది, శాంతమ్మగారు.

"అరే నిన్నటివరకూ బాగానే వున్నారండీ" అన్నది అప్రయత్నంగానే నీరజ.

"అంతా మా ఖర్మ అండీ. కష్టాలు యెవరికయినా చెప్పివస్తాయా?"

నీరజ మారు మాట్లాడకుండా పెట్లోంచి యాభై రూపాయలు తీసిచ్చింది. తను గూడా తొందరగా ముఖం కడుక్కుని వెళ్లింది. శాంతమ్మగారు కుక్కి మంచంలో బాధతో విలవిలలాడిపోతోంది. పిల్లలిద్దరూ బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు. పూరిల్లు కంతలగుండా సూర్యకిరణాలు ఆమెను పరామర్శిస్తున్నాయి.

"యేమండీ! దొడ్డమ్మగారూ యెలా వుంది?" అంది, ఆమె నుదిటిమీద చెయ్యి వేస్తూ. శాంతమ్మగారి నుదురు కాలిపోతోంది. అంత బాధలోనూ, కళ్లు నీరసంగా తెరచింది. కళ్లలో నీళ్లు.

"మీరు అధైర్య పడకండి. మీకు తొందరలోనే ఆరోగ్యం చేకూరుతుంది" అంది నీరజ, కళ్ల నీళ్లు చాటుగా వొత్తుకుంటూ. శాంతమ్మగారు నవ్వింది. జీవితం ఆఖరి అంచున నిలబడి, వొరిగిపోతున్న బాధతో చింతాక్రాంతమైన చిరునవ్వు. "ఈ నాలుగునాళ్ల పరిచయానికే కన్నీరు కారుస్తున్నావా తల్లీ?" అన్నట్లుగా వుంది. కాసేపు వుండి నీరజ వెళ్లిపోయింది. యెక్కడిదో ఈ అనుబంధం. ఆమెతో జన్మ జన్మల అనుబంధమా! నీరజ హృదయం వేదనతో కొట్టుకుంటున్నది.

"భగవాన్! ఆమెను రక్షించు. ఆమెలో కోరికను తనివితీరా తీర్చుకునే చిన్న అవకాశం ఇయ్యి" అంది నీరజ స్నానం చేసి దేవుడ్ని ప్రార్థిస్తూ.

కాసేపయిన తర్వాత డాక్టరును కొడుకు తీసికెడుతూంటే నీరజగూడా వెళ్లింది. అప్పటికే శాంతమ్మగారి పరిస్థితి విషమించిపోయింది. డాక్టరు వెంటనే ఇంజక్షను ఇచ్చాడు. కానీ ప్రాణం చిలక, ఆతని ప్రయత్నాన్ని పరిహసించి, రెక్కలు కట్టుకుని అనంతమైన విశ్వంలో, గాలిలో కలిసిపోయింది.

చింతాక్రాంతమైన ఆమె వదనం నిశ్చింతగా వుండి, బాధను బయటకు తోలేసింది. మరుక్షణం లోనే యేడుపులూ, పెడబొబ్బలూ, బ్రతికి వుండగా సమంగా చూడకుండా హింసించిన రక్త సంబంధాలు, సమాజంకోసం, సభ్యతకోసం, కుసంస్కారంతో విడవలేక యేడుస్తున్నాయి. శాంతమ్మగారి మరణానికి పేదిలో ఇతరులు కన్నీరు పెట్టని క్షణం లేదు.

ఎండ చరచరా నెత్తిమీదకు వచ్చేస్తోంది. యెంతసేపని వుంచుతారు ప్రాణంలేని కట్టెను. ఏడుకట్ల సవారీ తయారయింది. శవానికి పీటల మీదనుంచి నీళ్లు పోస్తున్నారు. నీరజ పిచ్చిగా ఇంటికి పరిగెత్తింది. రాత్రి పట్నం నుండి తెచ్చిన కెమెరా తెచ్చింది.

కంపిస్తున్న చేతులతోనే శాంతమ్మగారి కట్టెకు నాలుగు ఫొటోలు తీసింది.

శవం అంతిమ యాత్రకు బయలుదేరింది.

"దొడ్డమ్మగారూ బ్రతికివుండగా మీ కోరికను తీర్చలేకపోయినానండీ" అంటూ కళ్లు మూసుకుని నీరజ, ఉప్పెనలా వస్తున్న దుఃఖానికి లొంగిపోయి ఇంటికి వచ్చేసింది.

## దివ్య దీపావళి

మనలో చీకటి తొలగించే
మనసుల జోతులు వెలిగించే
నీతికి మందిర మైనట్టి
ప్రగతికి పందిరి యైనట్టి
దీపావళి యిప్పుడు వచ్చెను
తప్పుడు పనులకు
చెప్పుడు పలుకుకు
తిప్పలు దెచ్చిన
దీపావళి నేడిటు వచ్చెను
తిమిరాలను, సమరాలను
శోకాలను, కాకాలను
కడతేర్చిన దీపావళి యిప్పుడు వచ్చెను
కాదిది దీపావళి
హృదయోల్లాసావళి
దివ్యమై నవ్యమై
శ్రవ్య సేవ్యమై వచ్చిన దీనికి
పలకండి స్వాగతాలు
చిలకండి అమృతాలు.

— సుచంద్ర

'తెల్ల గులాబిపై మంచు బిందువులు'



—ఫొటో : వి. ఉమామహేశ్వర్

# చిటపటలు


ఏంటోయ్ నీమొహం మతాబాలాగా వెలిగిపోతోందివాళ ?!
... పంచదార దొరికిందోయ్!


దీపావళి మందులు అట్టి కాకా పడుతున్నాడనుకున్నాం గాని... ఈ మందులను కొలేదోయ్ మనం!
VAT


ఇదివరకు లంచాలు మేసేటప్పుడు చిచ్చుబుడ్డి.. ఇప్పుడు చచ్చుబుడ్డి!


మన ఆఫీస్‌లో 'సిసింద్రీ చిట్టిబాబు' ఎవరి మారుపేరు అని అడిగేవాడివిగదూ..చూడు
సిసింద్రీ చిట్టి బాబు


సార్! మీకు బాంబులాంటి వార్త తమర్ని నిర్బంధంగా రిటైర్ చేశారు!


మీవాడు సీమటపాకాయలాగా చిటపటలాడుతున్నాడేంటి?
సీమటపాకాయలు తేలేదనీ...!



# పెరిగేవయసుకు ఆధారం
# కాల్షియం-శాండోజ్®

## ఈ పెరిగే వయసుదాటితే, ఎంత కాల్షియం అయినాసరే వారి పెరుగుదలకు తోడ్పడదు!

మరీ ఆలస్యంకాకముందే మీ పిల్లలకు కాల్షియం-శాండోజ్ ఇవ్వండి.

ప్రపంచంలో అత్యుత్తమమైన కాల్షియం-శాండోజ్ వారిచే స్విట్జర్‌ల్యాండ్‌లో అభివృద్ధిపరచబడినది.

పిల్లల పళ్ళకూ, ఎమూకలకూ, పెద్దలకన్న రెండింతలు కాల్షియం అవసరం. వారు దారుఢ్యంగా, బాగా పెరగాలంటే ఏడాది ఏడాదికీ వారికి ఎక్కువ కాల్షియం అవసరమౌతుంది.

వారికి కాల్షియం-శాండోజ్ బిళ్ళలు అవసరం. విటమిన్ సి, డి, బి 12లతో బలపరచబడి, రాస్ప్‌బెరీ రుచిగల్గి, మధురమైన కాల్షియం-శాండోజ్ బిళ్ళలు కనీసం రోజుకు 4 వారు చప్పరించేలా చూడండి.








**కాల్షియం-శాండోజ్®**

ప్రతి రోజు ప్రతివారికి

సీరియల్ | # డాక్టర్ వనిత | గంటి వెంకటరమణ

(గత సంచిక తరువాయి)

రెండు రోజులు గడిచాయి. ఇల్లు చేరుకునే వరకూ ఏ ఆర్భాటమూ జరుగలేదు. తండ్రికి యీ విషయాలన్నీ చెప్పాలనుకుని ఆయన గదిలోకి అడుగుపెట్టింది. ఆయన టేబిల్ మీద వున్న తల్లీ తండ్రీ ఫొటోల్ని తదేకంగా చూస్తూ యామిని గదిలోకి రాగానే 'చూశావా నువ్వెంత అదృష్టవంతురాలివో!' అన్నాడు.

చెప్పాలనుకున్న విషయాలన్నీ యీ ఒక్క మాటతో లోపలికి వెళ్లిపోయాయి. ఆయన వైపు సరిగా చూడలేకపోయింది. యామినికి



జ్ఞానం వచ్చినప్పటినుంచీ తండ్రే తల్లికన్నా ఎక్కువగా చూస్తూవచ్చాడు. ఈ విషయాలన్నీ చెప్పడంవల్ల ప్రయోజనమేమీ కనిపించలేదు. కనీసం ఆయన తృప్తికైనా తను నోరు మూసుకోవడం మంచిదనుకున్న యామిని మౌనంగా వుండిపోయింది.

'నువ్వెంత దూరం వెడుతున్నావామ్మా నన్నిక్కడ ఒక్కడినీ వదిలేసి.'

'పోనీ నాతో నువ్వుకూడా రా నాన్నా!''

నవ్వాడు ఆయన. 'భలేదానివే! తండ్రిని కాబట్టి మనసులో దాచుకోలేక ఆమాట అన్నాను. నేను నీతో రాగలిగినా రాకూడదమ్మా!'

'అదేం నాన్నా!'

'నువ్వు ఆడపిల్లవి.'

యామినికి వున్న ఒక్క ఆశా అంతరించిపోయింది. తండ్రి తనతో కొన్నాళ్లు వస్తే యీ కొత్త భయం పోతాయనుకుంది. ఆయన రాడని నిశ్చయంగా తెలిసిపోయింది. ఇక భర్తతో ఒంటరిగానే ప్రయాణం అయింది.

రావు తన సిద్ధాంతాలన్నీ తప్పనిసరిగా తను పాటిస్తాడు. తన భార్య ఆచరించాలన్న పట్టుదలకూడా అతనికి వుంది.

బొంబాయిలో అడుగు పెట్టగానే యామినికి అయోమయంగా అనిపించింది. హైద్రాబాద్‌లో పెరిగినా యీ వాతావరణం పూర్తిగా హైద్రాబాద్‌కి భిన్నంగా కనిపిస్తోంది. ఇంతకంటే తెనాలి ఎంత బాగుంది అనుకుంది స్టేషన్‌లో దిగగానే. స్టేషన్ బయటకి వచ్చాక అతను దాదర్‌లో తను వుండే ప్రదేశానికి టాక్సీ మాట్లాడాడు.

టాక్సీ బయలుదేరగానే టాక్సీ అద్దాల కిటికీగుండా బయటికి చూసింది యామిని. ఎత్తయిన మేడలు. తల పైకెత్తి చూస్తూంటే మెడ నొప్పి పెట్టేట్లున్నాయి. ఎక్కడా మామూలు బంగ్లా లేదు. వెడల్పయిన రోడ్డుమీద రకరకాల వాహనాలు దొర్లుకుంటూ వెళ్లిపోతున్నాయి. అవన్నీ చూస్తూ యామిని లోలోపల ఆశ్చర్యపోయింది.

యిన్నాళ్ళూ తను హైద్రాబాదే పెద్ద నగరం అనుకుంది. హైద్రాబాద్‌లో ఆడపిల్ల సైకిలు తొక్కుతే ఒక్కోసారి ఆశ్చర్యపోయేది. యిక్కడ...

ఆమె ఆలోచనలు సాగుతూనేవున్నాయి. యిల్లు వచ్చేసింది. తను వస్తున్న విషయం అన్నపూర్ణమ్మకి వ్రాశాడు రావు. ఆమె ట్రైను టైము అయిందని చూసుకుంటూ బయటికి వచ్చింది. యామినికి ఆమెని పరిచయం చేశాడు. యామిని ఆవిడకి నమస్కారం చేసింది.

'రావ్! మీ ఆవిడ బాగుందయ్యా. కోడలు బంగారంలా వుంటే మనవలుకూడా బంగారాల్లాగానే వుంటారని సామెత' అంది ఆమె కలుపుగోలుగా.

'తులసీ' ఆమె కేక విని యిరవై ఏళ్ళ మహారాష్ట్రుల పిల్ల పసుపూ పారాణీ నీళ్ళు తీసుకువచ్చి కొత్త పెళ్లికూతురికీ, పెళ్లికొడుక్కీ దిగదుడిచి పక్కన పారబోసింది. రావు ఏమీ అనలేదు. సామానంతా పైకి చేరవేశాడు. యామిని అన్నపూర్ణమ్మ వెనుకే మెట్లెక్కి వెళ్లింది.

ఆవిడ అప్పటికే వంట పూర్తిచేసింది. యిద్దరినీ పిలిచి వడ్డించింది. కొత్త దంపతులకి స్వీటు కూడా చేసింది. ఆ విషయం తింటున్నప్పుడు వాళ్ళు గమనిస్తారో లేదో అని తనే చెప్పింది. రావు నవ్వి 'గుర్తించాను' అన్నాడు.

ఆ రాత్రి అన్నపూర్ణమ్మ యామినిని పిలిచి 'నేను రామమందిరంకి వెడుతున్నాను ఈ వారం రోజులూ అక్కడ భజనలు బాగా జరుగుతాయి నువ్వు తలుపు వేసుకో. నేను ప్రొద్దునే వస్తాను' అంది.

***జరిగిన కథ 3 : తల్లి***

యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వచ్చిన డాక్టర్ వనితకి రైల్లో తారసపడ్డ ఎస్. కె. గాంధీ తన అందంతో ఆమె హృదయంలో తిష్ఠవేస్తాడు. తనను ఎంతో ప్రేమగా చూచే మేనమామ భార్య శ్రీదేవి భర్తృ పరిత్యక్త అయిన తన తల్లిపట్ల నిర్దాక్షిణ్యంగా వుండటం బాధిస్తుంది వనితని. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్ ఇంజనీర్. తనను పెళ్లాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొచ్చి ఎటూ నిర్ణయించుకోలేక పోతుంది వనిత. గతంలో... యామిని కిష్టం లేకపోయినా భగవన్నారాయణ రావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. పాశ్చాత్య నాగరికతపై మోజున్న భర్త కోపతాపాలకి హడలి పోతుంది యామిని.

## సుదీర్ఘమైన శస్త్ర చికిత్స

అమెరికా మేరీలాండ్‌కి చెందిన బాల్టిమోర్ నగర ఆసుపత్రిలో పదమూడున్నర గంటలు పట్టిన పెద్ద శస్త్ర చికిత్సను చేసి ఫొటోలో నున్న బాలుని తొడ లోపలి పుట్టకురుపు భాగాన్ని తొలగించారు వైద్యులు. ఈ సుదీర్ఘమైన చరిత్రాత్మకమైన ఆపరేషన్ చేస్తున్నంతసేపూ 'సూక్ష్మదర్శిని' కళ్లద్దాలు ధరించారు. జాన్‌హాప్‌కిన్స్ విశ్వ విద్యాలయానికి చెందిన యీ వైద్యబృందంవారు యీ బాలుని తొడ ఎముకలో పుట్టకురుపు 150 మిల్లీమీటర్ల ఎముక ముక్కని తీసేసి దాని జాగాలో అతని మోకాలి క్రిందిభాగంనుంచి ఎముక ముక్కను తీసి ''అతికించేశారు.'' ఈ ఎముకతో పాటు కొత్త రక్తనాళాలుగా వారు తలవెంట్రుకకన్న సన్నమైన నైలాను నాళాల్ని పెట్టి సహజ రక్తనాళాలను కత్తిరించిన రక్తనాళాలకు కలిపి కుట్టేశారు. ఇది అపూర్వ శస్త్ర చికిత్స.



చేసి వెళ్లిపోయింది. రావు ముందు వరండాలో సిగరెట్ వెలిగించి పచార్లు చేస్తున్నాడు. యామిని మంచంమీద పడుకుని ఆలోచిస్తోంది. అతనితో ఒక మాట మాట్లాడితే తక్కువ రెండు మాట్లాడితే ఎక్కువ ఎలాగో ఏమో... అనుకుంటోంది.

'చూశావా యామినీ ఆవిడకి పడుచు దంపతులకి ఏకాంతం అవసరం అని ఎంత బాగా తెలుసో. మీ యింట్లో మా యింట్లో మేళం ఒకటే తక్కువ. నా కటువంటి పద్ధతులు అసహ్యం.'

''తెలుస్తూనే వుంది' యామినికి అతను ప్రతిసారీ యీ విషయాన్ని గుర్తుచేయడం చికాకుగా వుంది. అందుకే కసిగా మనసులో అనుకుంది.

'ఏమంటావ్ ?'

'అవును మీరన్నది నిజం' వెర్రిగా నవ్వి సమాధానం యిచ్చింది. ఆ రాత్రి రావు ఆమెను పెనవేసుకుని ''జీవితం మూడు పూవులూ ఆరు కాయలూ మాదిరి వుండాలి. అనవసరపు సెంటిమెంట్లంటే నాకు చిరాకు. మనం అతి త్వరలో లండన్ వెళ్లిపోవాలి నా చదువు అయిపోయింది. ఈ హౌస్‌సర్జన్సీ అయితే మీ నాన్న పంపడమే ఆలశ్యం.'' అన్నాడు.

యామినికి దుఃఖం ముంచుకువస్తోంది. కడుపు నింపుకోవాలనుకునేవాడు ఆకలికి కొన్నరొట్టె అయినా సంతోషంగా తిని మంచినీళ్లు తాగుతాడు వాడి ముందు పంచభక్ష పరమాన్నాలూ కాక త్రాగేందుకు

## డాక్టరం వసత

ఏ ఫారిన్ లిక్కర్ వుంచినా 'ఖర్మ' అని నుదురు కొట్టుకుంటాడు.

పెళ్లంటే తలంబ్రాలు పోసుకోవడం, పల్లకీలో వూరేగడం అనుకుంది యామిని. కాకపోతే చంద్రం బావతో తను అప్పుడప్పుడు ఆడుకున్న గుజ్జనగూళ్లు అనుకుంది.' కానీ అది తనపట్ల యీ విధమైన లీయని విషంలా పరిణమిస్తుందనుకోలేదు. అతను ఏదో చెబుతున్నాడు. ఆమె 'ఊఁ, ఆఁ'ల తోనే సరిపెట్టుకుంది.

రావు నిద్రపోయాడు. యామిని అతన్ని జరిపి తేలికగా గాలి పీల్చుకుంది.

*     *     *

'మనం స్టుడియోకి వెళ్లి ఫొటో తీయించుకుందాం. ఇక్కడ ఫొటోలు తీసినట్లు మరెక్కడా తీయరు.' అంటూ రావు వస్తూనే బూట్లుకూడా విప్పకుండా యామినిని తొందరచేస్తున్నాడు.

యామినికి నిలుచుంటే నీరసం వచ్చేట్లుంది. తిన్నదేదీ అరగడంలేదు. తనకి రొట్టె తినడం అలవాటు వున్నా నోటికి వెగటుగా వుంది. అన్నం అసలే సహించలేదు. టీ త్రాగితే వాంతి అయిపోయింది. వేళ్లమీద లెక్కలు చూసుకుంది. ఇక్కడికి వచ్చి ఎనిమిది నెలలు అయింది. తను ... రెండు నెలలు దాటిపోతోంది. ఈ విషయం అతనికి చెబితే? ఏమంటాడోనన్న భయంకూడా వేస్తోంది. అన్నపూర్ణమ్మగారు అడగనే

'నేను రాలేనండి.' యామిని ఆఖరికి నెమ్మదిగా అనగల్గింది.

రావు నిశ్చేష్టుడై తెప్పరిల్లి 'ఏం ఎందుకనీ ?' అని అడిగాడు.

'నా ఒంట్లో బాగులేదు.'

అతను వెంటనే ఆమె చేయి పట్టుకున్నాడు. ఆ వెంటనే వదిలివేసి 'జ్వరం కూడా లేదు. ఏమైంది ? డాక్టర్ దగ్గరకి తీసుకువెడతాను పద.' అన్నాడు.

యామిని అతను కూర్చున్నాక మంచం మీద అతని పక్కనే కూర్చుని 'నాకు...నాకు రెండు నెలలు నిండుతాయి.' అంది.

రావు ఆమె మొహంలోకి చూశాడు. అతను అశాంతితో పోరాడుతున్నట్లు మొహంలో మార్పులు కనిపిస్తూనేవున్నాయి. యామిని భయంగా చూసింది అతనివైపు. ఆ తరువాత అంది నెమ్మదిగా ... 'పోసి వస్తున్లెండి.'

'అవసరంలేదు. నిన్ను వెంటనే హాస్పటల్‌కి తీసుకువెడతాను.'

యామిని అతనివైపు అయోమయంగా, అనుమానంగా చూసింది. 'ఎందుకు ?' అని కూడా అడగగల్గింది.

'ఎందుకా ?' అతను తీక్షణంగా చూస్తూ అన్నాడు. 'నువ్వు పదహారేళ్ళకే తల్లివి కావడం పాతిక దాటుతూనే అమ్మమ్మవి కావడం నాకు యిష్టం లేదు. నీకు అబార్షన్ చేయిస్తాను. ముందు హాస్పటల్‌లో చెక్ చేయించి ఆ తరువాత అంతా రహస్యంగా జరిగిపోతుంది.'






యామిని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె అతనివైపు ప్రాధేయపడుతున్నట్లు చూసింది! 'ఒద్దు మీ రా పని చేయద్దు, నేను ఒప్పుకోను.'

అతను నిర్లక్ష్యంగా వెళ్లిపోయాడు.

యామినికి ఒంట్లో బాగుండడంలేదని ఆమెకన్నా ముందే అతను అన్నపూర్ణమ్మతో అన్నాడు. అందు కామె నవ్వి 'మీరంతా చిన్న చిన్న విషయాలకే భయపడిపోతారు. మేమైతే యిటువంటివి పట్టించుకునేవారం కాము' అంది.

ఆ సాయంత్రమే అతను తెలిసిన లేడీ డాక్టర్‌తో సంప్రదించి యామిని చేత బలవంతంగా వొప్పించి అబార్షన్ చేయించాడు.

అన్నపూర్ణమ్మ అబార్షన్ సంగతి విని 'అయ్యో పాపం యింత బలహీనం మనుషులా' అంది కొద్దిగా ఆశ్చర్యపోతూ.

యామిని రెండు రోజులు తరువాత యింటికి వచ్చింది. ఆమె చాలా అలిసిపోయింది. రావుతో 'యింటికి వెడతాను' అంది. అతను అందుకు వొప్పుకోలేదు.

రోజులు గడుస్తూంటే గాయం మాయమైపోయినట్లే యామిని పూర్తిగా ఆ విషయం మరిచిపోయింది. ఎదురింటి దేశ్‌పాండేగారమ్మాయి ఆషా రావడంతో తిరిగి కొత్త సమస్య ఎదురైంది ఆషా బియ్యే చదువుతోంది. కాలేజీ పిల్లలందరి మాదిరి గానే కొంత ఫాషన్‌గా వుంది. ఆ పిల్ల ఆకర్షణీయంగా కనిపిస్తుంది. రెండు జడలూ, చెవులకి రింగులూ, పంజాబీ డ్రెస్సు వేసుకుంటే చూసేందుకు మరీ మరీ బావుంటుంది. రావు ఆ పిల్లను చూడడం జరిగాక యామినిని టైలర్ దగ్గరకు తీసుకువెళ్లి కొలతలు యిప్పించి మంచి డ్రెస్ తయారు వేయించాడు. ఆ రాత్రి యామిని అతనికి రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేసింది 'నాకు ఆ డ్రెస్ వేసుకోవడం ఎప్పుడూ అలవాటులేదండి. యిప్పుడు వేసుకుంటే అదెమిటో యాసగా వుంటుంది. నాకసలు బట్టలు వేసుకున్నట్లే అనిపించడంలేదు. నేనింక యీ బట్టలు వేసుకోను నాకీ రింగులూ వొద్దు, పాడూ వొద్దు.'

రావు నవ్వి 'అలవాటు లేనప్పుడు కొత్తలో అందరికీ అలాగే వుంటుంది. మనం అడ్జస్ట్ అయిపోవాలి. రేపటినుంచి ఆషా వచ్చి నీకు చదువు చెబుతుంది' అన్నాడు

యామిని బిత్తరపోయి చూడసాగింది. అతనిమీద అసహ్యం కలగసాగింది. భార్య అంటే అతని వుద్దేశ్యం ఏమిటో క్రమంగా అర్థం చేసుకోసాగింది. కీలుబొమ్మకి 'కీ' యిస్తే ఆడినట్లే ఆడించే బొమ్మవంటిది అనుకుంటున్నాడు అతడు. యామినికి చికాకు వేసింది. తండ్రితో పేచీపెట్టి రభస చేసి చదువు మానేయగలదు. ఈ శాసనానికి మాత్రం తను చచ్చినట్టు లొంగిపోవాలో ఏమో ? యామిని నిబ్బరంగా అంది. 'నేను చదవను. నాకూ చదువుకూ సరిపడదు.'

'ఎంత ధైర్యం నీకు. ఒక డాక్టరు భార్య అప్పలమ్మ మాదిరి చదువూ సంధ్యా లేకుండా... నేను భరించలేను.'

'హుఁ!' యామిని తిరస్కారంగా నవ్వింది. 'ప్రపంచంలో డాక్టర్ల భార్య లందరూ చదవడంలేదు. కనీసం నాలాంటి వాళ్లు మరో నలుగురైనా వుంటారు.'

'ఇంతకీ నువ్వు చదవనంటావు.'

'అవును.'

రావు బూట్లు శబ్దంచేస్తూ విసురుగా వెళ్లిపోయాడు. యామిని ఆశ్చర్యపోయింది. తనేనా యిన్ని మాటలు మాట్లాడగల్గింది.

ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకూ రావు యింటికి రాలేదు. డబ్బు తీసుకోవడం, భోజన సదుపాయాలు చూడడం అవసరం అనుకుంటే రెండు మాటలు మాట్లాడడం లేదా పురాణానికో, గుడికో వెళ్లిపోవడం అన్నపూర్ణమ్మ పని. ఆమెకి రావుకీ, యామినికీ మధ్య జరిగిన సంగతులేమీ అవసరంలేదు. పంజాబీ డ్రెస్ వేసుకున్న యామినిని 'అదేమీ ?' అని ప్రశ్నించలేదు. అబార్షన్ ఎందుకైంది అని కనుక్కోలేదు. యామిని లైటు వేసుకుని చందమామ చదువుతూంటే యివాళ యింకా లైటు వెలుగుతోందేం అని అడగలేదు.

బాగా ప్రొద్దుపోయినా రావు రాకపోవడం కొద్దిగా ఆశ్చర్యపడినట్లు 'యింకా రాలేదేమో యీ రావు ?' అంది తనలో తను గొణుక్కుంటున్నట్లు. యామిని ఆ మాట విని వూరుకుంది. యామిని మొదట్లో అన్నిటినీ సరిపెట్టుకుంది. రాను రాను రావు చేసే ప్రతి పనీ నిరంకుశత్వంలా కనిపించి ఎదురుతిరగాలనే కోరిక కలగసాగింది. అతను ఫామిలీ ప్లానింగ్ అమలుపరిచే మందులు తీసుకువచ్చి యామినికి యిచ్చాడు. ఆమె వాటిని తీసుకువెళ్లి పేపర్లన్నీ జాగ్రత్తగా తీసేసి టాబ్లెట్స్ డ్రైనేజ్‌లో పారేసింది ఆ సంగతులు అతనికి తెలియవు.

రావు మాట నెగ్గకుండా తను యిప్పుడు తిరిగి గర్భవతిగా వుండడం యామినికి ఎగిరి గంతు వేయాలన్నంత సంతోషంగా వుంది. ఈ విషయం తెలిస్తే అతను కల్లుతాగిన కోతిమాదిరి గంతులు వేస్తాడనికూడా ఆలోచించసాగింది.

యామినికి యిప్పుడు నిండా పదహారు ఏళ్ళు. ఆమె భర్తకి భయపడుతుంది మనసులో అతన్ని ఏడిపించి సరదా తీర్చుకోవాలన్న కోరికకూడా పెంచుకుంటుంది. అతని ప్రక్కనే పడుకుని నిద్రపోతున్న అతనివైపు చూస్తూ తనది పైచేయి ఎప్పుడౌతుందా అని ఎదురుచూస్తూంటుంది.

రావు రాత్రి వచ్చాడు. భార్యకి వుండాల్సిన బాధ్యత తండ్రి ఎప్పటికప్పుడు ఉత్తరాల్లో గుర్తు చేస్తూండడంవల్ల 'భోజనానికి లేవండి.' అంది.

అతను ఒకసారి ఆమెవైపు తిరస్కారంగా చూసి 'నా కక్కర్లేదు.' అన్నాడు ఖస్సుమన్నట్లు.

'మీ యిష్టం.' యామిని అతనికోసం ఎదురుచూడకుండా వంట యింట్లోకి వెళ్లి భోజనంచేసి వచ్చి మంచంమీద ముడుచుకు పడుకుంది. రావు మాట్లాడకుండా వెళ్లి మడతమంచం మీద పడుకున్నాడు.

| ఇంకా వుంది



'ఓ మనిషీ తిరిగి చూడు'లో మురళీమోహన్

# * టపాకాయలు కాల్చడం మానేశాను *

చిన్నప్పుడు చదువుకునే రోజుల్లో, దీపావళి పండుగ వస్తుందంటే చాలు — పండుక్కి నెలరోజులు ముందు నుంచి సంబరపడిపోయేవాళ్ళం. రోల్, రోకలిలో పెట్లుప్ప + గంధకం పెట్టి పోటీలమీద పేల్చేవాళ్లం. శబ్దం బిగ్గరగా వుండాలనే ఉద్దేశ్యంతో బోలెడంత గంధకాన్ని రోల్‌రోకళ్లో క్రుక్కి, చెవులు చిల్లులు పడేట్లు వీధి, వీధిలో పేల్చేవాళ్లం

చిచ్చుబుడ్లు కాల్చడంలో నాది పైచేయిగా వుండేది ఒక్కసారిగా అయిదు చిచ్చుబుడ్లను (భుజంమీద రెండు, అరచేతుల్లో రెండు, నెత్తిమీద ఒకటి చొప్పన) కాల్చేవాడిని నా మిత్రు లందరూ నా మొండిధైర్యం చూచి నివ్వెరపోతుండే వారు నిప్పురవ్వలు చిందే ఆ చిచ్చుబుడ్ల వేడిమిని వీడెలా భరిస్తున్నాడని వింతగా చూచేవాళ్లు

చిన్నప్పుడు కొన్నిరకాల మందుల్ని మేమే స్వయంగా తయారు చేసుకునేవాళ్ళం. మైలుతుత్తము, రంపపుపొడి, ఇంకా కొన్ని కొన్ని సామాన్లను కలిపి, వుండలు వుండలుగా తయారుచేసి, వాటిపై బంకమట్టి పూసి, ఆ వుండలకు రంధ్రాలుచేసి, ఆ రంధ్రాలకు దారాలు కట్టి, వాటికి నిప్పంటించి, వేగంగా గిరగిర త్రిప్పేవాళ్లం ఎవరెంత వేగంగా, ఎన్నిరకాలుగా త్రిప్పుతారనే పోటీలో పాల్గొని, అందరికన్నా వేగంగా, ఎన్నోరకాలుగా ఆ పూలపటాలను త్రిప్పేవాడ్ని.

ఇలా పూలపటాలు త్రిప్పుతుండగా ఒకరోజు ఓ పెద్ద ఘోరం జరిగిపోయింది. దారంతో గిరగిర త్రిప్పుతున్న పూలపటాన్ని, మండైపోయిందనే నమ్మకంతో పైకి విసిరేశాను. కానీ నే ననుకున్నట్టు ఆ పూలపటం ఆరిపోలేదు. అడుగునెక్కడో కాస్త నిప్పురవ్వలు వున్నాయి. నే విసిరేసిన ఆ పూలపటం



'జరుగుతున్న కథ'లో చంద్రమోహన్

ఓ పాకమీదెళ్లి పడింది. ఇక చెప్పేలా! అయిదు నిమిషాల కంతా అగ్నిజ్వాలలు వుప్పెత్తున లేచాయి. ఆ మంటను చూచి నేను కంగారుపడిపోయాను. ముందు, వెనుక ఆలోచించకుండా పరుగెత్తుకెళ్లి ఆ పాకమీది కెక్కేసాను. తాటాకుల్ని చర, చరా లాగి క్రింద పడేశాను. పాకలో కట్టివేయబడివున్న పశువుల్ని పలుపులతోసహా పెకలించి బయటికి తోలాను. తాటాకులు లాగేపుడు ఓ తాటాకు జారడంతో నేను క్రిందకు జారడం, అలా జారినపుడు నా కాలు కోసుకుపోవడం జరిగింది. రక్తం ప్రవాహంగా స్రవిస్తున్నా దెబ్బ తగిలిందన్న ఆలోచన లేదు నాకు ఆ సమయంలో. వాయుదేవుని కళ్లు అగ్నిదేవుడిపై పడకముందే మంటలను ఆర్పేయాలనే ధ్యాస తప్ప, వేరే ఆలోచనే రాలేదు నాకు ఎలాగో గండం గడిచింది

ఆరోజు జరిగిన సంఘటన నాలో క్రొత్త మార్పును తీసుకొచ్చింది దీపావళి సమయంలో కనీసం కాకరొత్తులుకూడా కాల్చకూడదనే గట్టి నిర్ణయాన్ని తీసుకున్నాను. అప్పటినుంచి యిప్పటి వరకూ ''దీపావళి'' సీజన్‌లో కాదు — ఆ పండుగ రోజైనా మతాబులుకూడా కాల్చను

ఒకప్పుడు ''దీపావళి'' అంటే ఎగిరెగిరిపడి, వివిధ రకాల మందుల్ని విభిన్న పద్ధతుల్లో కాల్చే నేను ఈనాడు ''దీపావళి'' అను అందంటే, ఎందు

# మోహన్ ముందడుగు!

హీరో వర్‌షిప్ మీద ఆధారపడి వున్నది, ప్రపంచ చిత్ర పరిశ్రమ అనేడి వాదాన్ని బలపరుస్తూ, ఆ విజానికి నిదర్శనంగా ''నటసామ్రాట్, నటరత్న'' గార్లను పేర్కొన్నారు, ముందడుగు వేస్తున్న మురళీమోహన్

తన చిన్ననాటి కోరిక కొద్దిగా నెరవేరింది, అన్నారు మోహన్. ఏమిటా కోరిక అని యీ విలేఖరి అడిగాడు

''అక్కినేని నాగేశ్వరరావుగారితో కలిసి నటించాలి ''మహాత్ముడు'' చిత్రంలో చిన్న పాత్ర (అక్కినేని స్నేహితుడు) లభించింది. ఆయనతో వున్న ఆ ఒక్క రోజులో నేను నేర్చుకున్న నిజాలు ఎన్నో'', అన్నారు మురళి

''తిరపతి'' చిత్రం నిర్మించిన హనుమాన్ ప్రసాద్‌గారు, రాజబాబును అసలు పేరుగా గొన్న నేటి మురళీమోహన్‌గారి ఫోటోను నాకిచ్చి, పత్రికలో పరిచయం వ్రాయమని అడిగారు

అప్పుడే చెప్పాను మురళీమోహన్ హీరోగా స్థాండ్ అవుతాడని ''తిరుపతి'' చిత్రం తరువాత ''భారతంలో ఒక అమ్మాయి'' చిత్రం మురళీ మోహ · విపరీతమయిన పాలోయింగును తెచ్చి స్థిరపడడానికి సంశయించడంలేదు అక్కడ పరిశ్రమ అభివృద్ధి చెందుతుంది అని గట్టిగా నమ్ముతున్న వ్యక్తుల్లో మోహన్ ఒకరు

**నటిస్తున్న చిత్రాలు**

ప్రస్తుతం మురళీమోహన్ నటిస్తున్న చిత్రాలు దర్శకుడు.) అన్నపూర్ణా సినీ ఎంటర్ప్రైజస్ ''కల్పన'' (రాఘవేంద్రరావు దర్శకుడు; జయచిత్ర నాయిక.) మహేష్ ఎంటర్ ప్రైజస్ ''ప్రేమించి పెళ్లి చేసుకో'' (హేమాంబరధరరావు దర్శకుడు; జయచిత్ర నాయిక.) లావణ్యా పిక్చర్స్ ''గంగ... యమున... సరస్వతి'' (రోజారమణి నాయిక.) బాబ్ అండ్ బాబ్ కంబైన్స్ ''ఓ మనిషీ, తిరిగి చూడు'' (దర్శకుడు దాసరి; జయసుధ నాయిక.)



పెట్టా.

నేడు మురళీమోహన్ యింతటివాడయ్యా డంటే... దాసరిని ముఖ్య వ్యక్తిగా పేర్కొనాలి ఇమేజ్ వున్న ఒక దర్శకుడు యిచ్చిన ప్రోత్సాహ ఫలితమే, మురళీమోహన్ పాపులర్ అయ్యాడు.

క్రమశిక్షణ, పాత్ర పరిశీలన, బాగా చెయ్యా లన్న తపన మురళీకి పుంటిగాబట్టే, త్వరగా అభివృద్ధి చెందాడు.

ఈనాడు ప్రేక్షకులు మురళీమోహన్ను ఒక ముఖ్య కథానాయకుడుగా పరిగణిస్తున్న నిజాన్ని పరిశ్రమ గుర్తించి, మంచి పాత్రలు యివ్వడానికి ముందుకొస్తున్నారు.

**వెయ్యాలని వుంది !**

పెరుగుతున్న యీ [illegible] నటితో నటించాలని కోరడంలో ఎంతేని న్యాయం వుంది. "కళాభినేత్రి" వాణిశ్రీగారితో మురళీ మోహన్‌కు ఒక చిత్రం అయినా వెయ్యాలనివుంది. (సమంజసమయిన కోరిక.)

ఒకే రకం పాత్రలు వెయ్యడం యిష్టంలేక, యిటీవల మూడు చిత్రాలను వలదు అన్న మురళీ మోహన్‌గారి సమయస్ఫూర్తిని, యీ కలం అభినం దిస్తోంది.

**రాజధాని వ్యామోహం**

నెలకు యిరవై అయిదు రోజులు హైదరాబాదు లోనే వుంటున్న మురళీమోహన్ రాజధాని నగరంలో అన్నపూర్ణా పిక్చర్స్‌వారి "ప్రేమ లేఖలు" (జయసుధ నాయిక; రామవేంద్రరావు దర్శకుడు) చటర్జీగారి కొత్త చిత్రం (పి. సాంబశివరావు దర్శకుడు.) శ్యాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి చిత్రం (దాసరి దర్శకుడు; జయసుధ నాయిక.) శ్రీ లలితా మూవీస్ "ఇదెక్కడి న్యాయం" (ప్రభ నాయిక; దాసరి దర్శకుడు.) సృజనా ఎంటర్‌ప్రైజెస్ "తొలిరేయి గడిచింది" (జయచిత్ర నాయిక, కె. ఎస్. రామిరెడ్డి

**కృతజ్ఞత**

తన సినీ జీవితం యింతగా ప్రకాశించడానికి కారణభూతులయిన ప్రేక్షకులకు పత్రికా ముఖంగా దీపావళి శుభాకాంక్షలు అందజేస్తున్నారు,మోహన్.★

**తొలిరేయి...బలేహాయి !**

దర్శకుడు కె. ఎస్. రామిరెడ్డి రూపొం దిస్తున్న "తొలిరేయి గడిచింది" చిత్రాన్ని యీ విలేఖరి చూశాడు. మొదటినుంచి చివరిదాకా, చిత్రం వుషారుగా, వుల్లాసంగా అనిపించింది.

ప్రేక్షకుడు ఆశించే హాస్యం, శృంగారం, సంగీతం వున్నాయి "తొలిరేయి" చిత్రంలో. సత్యంగారి పాటలు హిట్ కేటుగా వుంటు.

మాటలు మధురంగా, సరళంగా, అందరికీ అర్థమయ్యే విధంగా వ్రాసిన గణేష్‌పాత్రో అభినంద నీయుడు.

సెట్స్ లేకపోయినా, బిల్డింగ్సును ఛాయాగ్రాహక దర్శకుడు రామచంద్రబాబు రమణీయంగా చిత్రించారు.

నటీనటుల్లో సత్యనారాయణ, జయచిత్ర, మురళీమోహన్, మోహన్‌బాబు, అల్లు రామ లింగయ్య, రమాప్రభ, విజయలలిత, జయమాలిని పేర్కొనదగ్గ నటన్ను ప్రదర్శించారు.

మొత్తానికి "తొలిరేయి బలేహాయి" అనిపించింది. ఈ చిత్రాన్ని ఎమ్. గోపాలకృష్ణ రెడ్డి నిర్మించారు.

'వక్రధార'లో వాణిశ్రీ

యిస్తుంటప్పు అనుకుంటాను.

— చంద్రమోహన్

# వధ ముగిసింది - కథ మారింది

"నేను 1959వ సంవత్సరం మద్రాసొచ్చాను. ఇప్పటికి పదహారు సంవత్సరాలు పూర్తయ్యాయి. ఈ పదహారు సంవత్సరాల కాలంలో నేను కొన్ని రకాల పాత్రలను వేశాను. "సారథి చేసిన ఫలానా పాత్రను మర్చిపోలేం" అనే ప్రేక్షకుల సర్టిఫికేటును ఎప్పుడు సంపాదిస్తానా అని ఇన్నేళ్ళు బాధపడేవాడ్ని.

గత సంవత్సరం అంటే 1975 నవంబర్‌లో సరిగ్గా దీపావళి సమయంలోనే నా జీవితంలో వసంతం కురిసింది. నిరాశ, నిస్పృహ అనే నరకాసురుల వధ ముగిసింది. "భక్త కన్నప్ప" చిత్రంలో కాశీ పాత్ర ధరించే సదవకాశం కల్గింది.

కృష్ణంరాజు, సూర్యనారాయణరాజుగార్ల గోపీకృష్ణ రథంలో, బాపూగారి రథసారథ్యంలో, ముళ్ళపూడిగారు మంత్రించి ఇచ్చిన నవ్వుల పువ్వు బాణము కాశీ (కో, కో, పా) నేనై, అలనాడు సత్యభామాదేవి నరకాసురుడ్ని వధించిన తెరగున, ఈనాడు కాశీ పాత్రధారణతో అంతవరకూ అలము కొని వున్న చీకటిని పారద్రోలి, వెలుగు కోసం ఆశ పడ్డాను. ప్రేక్షకులు కాశీగా ఈ సారథిని మెచ్చారు. ఆశీర్వదించారు.

గత సంవత్సర దీపావళి సంఘటన అద్భైతే, ఈ సంవత్సర దీపావళి సంఘటన మరింత ప్రోత్సాహ కరంగా వుంది. కృష్ణంరాజు, సూర్యనారాయణరాజు,

'రాజా'లో శోభన్‌బాబు, జయసుధ



'మనవడికోసం'లో ఒక సన్నివేశం

రావూ, ముళ్లపూడి వీరందరూ నాతో చేసిన పయోగం నా జీవితానికో చక్కటి ప్రయోజన ప్పెందినాడు. కాశీ పాత్ర వేసిన వేళావిశేషం చాలా ంచిది. అందుకే ఆ కాశీ ఎన్నో సిరులు తెచ్చింది. రులంటే డబ్బొక్కటే కాదు. పేరొచ్చినా, కృర్తొచ్చినా అదికూడా సిరే. కాశీ పాత్ర, నాకెన్నో షాలు వచ్చేట్టు చేసింది.

1974, '75 సగం వరకూ నా జీవితంలో జమైన "దీపావళి" ఎప్పుడొస్తుందా అని ఎదురు రాచేవాడ్ని. '75లో సరిగ్గా దీపావళి సమయానికి ' తెర జీవితంలో ప్రకాశవంతమైన వెలుగు కిరణం ురిసింది. ఆ వెలుగు కిరణం పదుగురి ప్రశంసా ్పొన్నందుకుంది. తత్ఫలితంగా నాకు కొన్ని వేషాలు వడం జరిగింది.

ఏనాడైతే ఒక మనిషికి ఆత్మతృప్తి, ఆత్మా ందం కల్గుతుందో ఆనాడే అతని జీవితంలో పావళి. నరకాసురుడ్ని వధించిన కారణంగా మన ందరం ఆ రోజు దీపావళి జరుపుకుంటున్నాం. ానికి మనిషిలో వున్న నిరాశ, నిస్పృహ, అప మ్మకం, ఇవన్నీ కనుమరుగై, ఆశాజనకమైన ంతివుంజాలు ఏనాడైతే ప్రకాశిస్తాయో ఆనాడే ంలైన దీపావళి. ఆ దీపావళి నరకాసురుడి ఆత్మ ంతి కోసం చేసుకుంటే, ఈ దీపావళి మన త్మానందంకోసం చేసుకుంటాం.

ఈ కాశీ నటిస్తున్న చిత్రాలను సవినయంగా కు మనవిచేసుకుంటాను.

"పి. ఏ. పి. వారి "అత్తవారిల్లు", "ఒక ం వెలిగింది", "చాణక్య – చంద్రగుప్త", ప్రేమించి పెళ్లి చేసుకో", "జరుగుతున్న కధ", యలక్ష్మివారి చిత్రం, సంగమేశ్వరవారి చిత్రం."

— సారధి

# సినిమా

***కురుక్షేత్రం ఒక మహాయజ్ఞం***

మాధవీ ... పద్మాలయా కంబైన్స్ వారి సినిమాస్కోప్ వర్ణ చిత్రం "కురుక్షేత్రం" భారత చలనచిత్ర చరిత్రలో అద్వితీయ స్థానాన్ని ఆక్రమించే విధంగా సింగారించుకుంటూ వుంది.

చిత్రాన్ని చూచిన వేల కళ్లు చెప్పిన మాటలు ఏమిటన: "చిత్రం మహాద్భుతం ... ప్రతి పాత్ర ఎంతో అందంగా, చక్కగా వుంది ... సంగీతం సుపర్బ్‌గా వుంది."

"కురుక్షేత్రం"లో నటిస్తున్న నటీనటులు అసాధారణ ప్రజ్ఞావంతులు ... ప్రేక్షకులకు ఇష్టమయినవాళ్లు. ఎవరు ఏ పాత్రను పోషిస్తున్నారో తెలపనా?

శోభన్ బాబు: కృష్ణుడు; కర్ణుడు: కృష్ణంరాజు; కృష్ణ: అర్జునుడు; సుయోధనుడు: సత్యనారాయణ; నాగభూషణం: శకుని; రాజబాబు: లక్ష్మణకుమారుడు; చంద్రమోహన్: అభిమన్యుడు; గుమ్మడి: భీష్ముడు. వీరుగాక దుశ్శాసనుడుగా గిరిబాబు, ద్రుపదుడుగా కాంతారావు, దుష్టద్యుమ్నుడుగా రంగనాథ్, శల్యుడుగా రావుగోపాలరావు, భీముడుగా రణధేవ్, ధర్మరాజుగా బాలయ్య నటిస్తున్నారు.

***స్త్రీ పాత్రలు ఎవరు?***

కుంతీదేవిగా అంజలీదేవి, ద్రౌపదిగా జమున, సుభద్రగా విజయనిర్మల, సత్యభామగా లత, రుక్మిణిగా చంద్రకళ, ఉత్తరగా జయప్రద, రేవతిగా ఉదయచంద్రిక, భానుమతిగా కృష్ణకుమారి నటిస్తున్నారు.

నటీనటు లందరూ యిదొక "ప్రెస్టీజ్" చిత్రంగా భావించి, చిత్ర విజయానికి దోహదం చేస్తున్నారు.

ఇక సాంకేతికంగా అంటారా? సంగీతానికి రాజేశ్వరరావు, ఛాయాగ్రహణానికి బాబూభాయి మిస్త్రీ, శిల్పానికి కుదరవల్లి, కూర్పుకు కోటగిరి, నిర్వహణకు వెంకన్నబాబు వంటి అనుభవజ్ఞులు వున్నారు. పురాణ కథలను బహుచక్కగా, ప్రేక్షక జనరంజకంగా రూపొందించగల ప్రజ్ఞ, ప్రాభవం కమలాకరునికి దేవుడిచ్చిన వరం. సముద్రాల మాటలు రసగుళికలవలె వుంటాయి, మరి.

***జయపూర్ పయనం***

భారత సంగ్రామాన్ని చిత్రీకరించడానికి మాధవీ ... పద్మాలయా కంబైన్స్ "జైపూర్"ను ఎంపిక చేసింది. నిర్మాత ఆంజనేయులుగారికి "కురుక్షేత్రం" చిత్రం అద్వితీయ విజయాన్ని ఆర్జించిపెట్టి, అనన్యమైన ఖ్యాతిని తెచ్చి పెడుతుంది.

'పేదని బంధం'లో ప్రేమ, కాటూరి





**డబ్బింగ్ చిత్రాల**

తెలుగు ప్రేక్షకులు డబ్బింగ్ చిత్రాల పట్ల చూపిస్తున్న ప్రేమాభిమానాలకు పరిశ్రమవారు ఆశ్చర్యాన్ని వ్యక్తపరచడంతో వూరుకోక, మరిన్ని చిత్రాలను తెలుగులోకి అనువదించి విడుదల చేసే ప్రయత్నంలో వున్నారు.

రాబోయే కొన్ని డబ్బింగ్ చిత్రాల వివరాలను యిక్కడ వ్రాస్తున్నాను.

**మనసున్న మనిషి**

సుశీలా ఎంటర్ ప్రైజస్ సమర్పించు, ఉదయనీ థియేటర్స్‌వారి చిత్రరాజ మిది. ఇందులో శివాజీ, కె. ఆర్. విజయ, ముత్తురామన్, గోపాలకృష్ణన్ ప్రధాన పాత్రధారులు. ప్రేమకన్నా స్నేహం గొప్పది అని చెప్పే వుదాత్తమైన అంశం గొన్న యీ చిత్రంలో శివాజీ నటన అద్భుతం. "కళావాచస్పతి" జగ్గయ్యగారి కంచుకంఠం మహాద్భుతం. ఈ చిత్రం అక్టోబరులో విజయా



'పెద్దన్నయ్య'లో రాము, సంగీత

పిక్చర్స్, (ఆంధ్ర) నవజ్యోతి పిక్చర్స్ (సీడెడ్) ద్వారా విడుదలవుతుంది.

**చేతిలో చెయ్యేసి చెప్పు!**

జనప్రియా పిక్చర్స్‌వారి "చేతిలో చెయ్యేసి చెప్పు" చిత్రం కూడా అక్టోబరులో విడుదల చెయ్యాలనుకుంటున్నారు, నిర్మాత అయిన సూర్య నారాయణరాజు.

ఈ చిత్రంలో శివాజీ, పద్మిని, సరోజాదేవి, నగేష్ ముఖ్య పాత్రలను పోషించారు. ఈ చిత్రానికి మైలవరపు గోపీ ముత్యాల్లాంటి మాటలను వ్రాశారు. విశ్వనాథన్ సుమధుర సంగీతాన్ని సమకూర్చారు.

విధి ఆడించిన వింత నాటకంలో విచిత్రమైన పాత్రను ధరించవలసిన కథానాయకుడుగా శివాజీ అద్భుతంగా నటించిన చిత్రమే "చేతిలో చెయ్యేసి చెప్పు". ఈ చిత్రంలో స్వర్గీయ ఎస్వీ రంగారావు మహాద్భుతమైన నటన్ను ప్రదర్శించారు.



'మనిషి రోడ్డున పడ్డాడు'లో రాజబాబు, రంగనాథ్

# సినిమా...

## బ్రహ్మ ముడి !

రాధిక చిత్రవారు అనువదిస్తున్న చిత్రం "బ్రహ్మ ముడి" తమిళనాడులో శతదినోత్సవాలను చవిచూచింది. ఈ చిత్రంలో శివాజీ, వాణిశ్రీ పోటాపోటీగా నటించారు.

"బ్రహ్మముడి" చిత్రానికి "డబ్బింగ్ చిత్రాల ఫేమ్" రాజశ్రీ మాటలను సమకూర్చారు. డబ్బింగ్ వాయిస్ యిచ్చే పి. జె. శర్మ నిర్వహణలో, పి. సూర్యనారాయణరాజు నిర్మించిన "బ్రహ్మముడి" చిత్రం త్వరలో విడుదలవుతుంది.

## గ్యారంటీ ఎక్కడుంది ?

పైన పేర్కొన్న మూడుగాక, మరో అయిదు అనువాద చిత్రాలను మనవాళ్లు విడుదలచేసే హక్కులను కొన్నారు. ప్రైవేట్ చిత్రాలకన్నా పర భాషా చిత్రాలే ప్రజాదరణకు పాత్రమవుతున్నాయి అని కొందరు నమ్ముతున్నారు. దేన్నయినా గుడ్డిగా నమ్మడం, అంత మంచిదికాదు. రెండు చిత్రాలు ధనాన్ని ఆర్జించాయిగదా అని, అందరూ డబ్బింగ్‌పై పడితే, ఫలితాలు ఎలావుంటాయో చెప్పడం కష్టసాధ్యమయిన విషయం.

జానపద చిత్రాలకు, యాక్షన్ చిత్రాలకు వాటిల్లిన ఆపద డబ్బింగ్ చిత్రాలకుకూడా జరగదనే గ్యారంటీ ఎక్కడుంది ?



'కురుక్షేత్రం'లో విజయనిర్మల

## ఎన్టీఆర్ నటిస్తున్న మొదటి "స్కోపు"

"సూపర్ స్టార్"ను కథానాయకుడుగా, రాఘవేంద్రరావును దర్శకుడుగా, ఫారెస్ట్ బ్యాక్ గ్రౌండును కథావస్తువుగా ఎంపిక చేశారు, సత్యచిత్ర అధినేతలు.

"నటరత్న" నటిస్తున్న మొదటి సినిమా స్కోపు చిత్రం కూడా సత్యచిత్రదే అవుతుంది.

జనవరి నుంచి ఫిబ్రవరి వరకు మైసూర్ ఫారెస్టులో క్యాంపు పెట్టాలి, అన్నారు సత్యచిత్ర అధినేతల్లో ఒకరయిన సూర్యనారాయణ.

నిర్మాతలు సత్యనారాయణ... సూర్యనారాయణ గార్లు అతిరథులను ఎన్నుకున్నారు. ఎన్టీఆర్‌తో బాటు గుమ్మడి, నాగభూషణం, సత్యనారాయణ, రాజబాబు, శ్రీధర్, పండరీబాయి, రమాప్రభ ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

కథానాయిక పాత్రలను జయసుధ, జయప్రద పోషిస్తున్న యీ స్కోపు చిత్రానికి మహదేవన్, విన్సెంట్, గొల్లపూడి, పట్టాభి ముఖ్య సాంకేతిక సారథులు.

## సంక్రాంతికి మూడు పెద్ద చిత్రాలు

రాబోయే సంక్రాంతికి మూడు పెద్ద చిత్రాలు వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. మూడు చిత్రాలలో ఒకటి మాత్రం మదరాసు స్టుడియోలో, మిగతా రెండు చిత్రాలు హైదరాబాద్ స్టుడియోలలో తయారవుతున్నాయి.

"చక్రధారి, కురుక్షేత్రం, దాన వీర శూర కర్ణ" చిత్రాలు పండుగ రోజున దర్శన మివ్వడానికి వీలుగా ఆయా చిత్ర నిర్మాతలు యిప్పట్నుంచే థియేటర్లను ఎన్నుకుంటున్నారు.

## ముగ్గురు కృష్ణులు

వస్తున్న మూడు భారీ వర్ణ చిత్రాలలో కృష్ణ పాత్ర కనిపించడం గమనించదగ్గ విషయం.

"దాన వీర శూర కర్ణ"లో ఎన్టీఆర్, "కురుక్షేత్రం"లో శోభన్‌బాబు, "చక్రధారి"లో రామకృష్ణ కృష్ణుడుగా నటిస్తున్నారు.

ఒకటి సినిమా స్కోపు చిత్రం. మరొక చిత్రం భక్తి రస ప్రధానం. ఇంకొక చిత్రంలో ఒకే నటుడు మూడు వైవిధ్యమయిన పాత్రలను పోషించడం.



'తాళికట్టి చూడు'లో నిర్మల, అల్లు

## రామిరెడ్డికి శుభయోగం

"పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్"లో దర్శకుడుగా డిగ్రీ పొంది, డాక్టర్ బి. ఎన్. రెడ్డి, స్వర్గీయ ఆదుర్తిగార్ల వద్ద శుశ్రూషచేసి, మూడు చిత్రాలను డైరెక్ట్‌చేసి, నాల్గవదాన్ని రూపొందిస్తున్న కె. ఎస్. రామిరెడ్డికి శుభయోగం పట్టింది అనడానికి నిదర్శనం ... "నటసామ్రాట్" అంగీకరించడమే.

నవలా చిత్రాన్ని నిర్మించేవాళ్లకు, అక్కినేని... వాణిశ్రీగార్లే గుర్తుకొస్తారు. దర్శకుడు రామిరెడ్డి తలపెట్టిన నవలా చిత్రంలో కూడా అగ్రద్వయమే ప్రధాన జంటగా నటించగలరని తెలిసింది.

వచ్చే సంవత్సరం ఫిబ్రవరి నుంచి అన్నపూర్ణ స్టుడియోస్‌లో ప్రారంభమయ్యే కె. ఎస్. రామిరెడ్డిగారి నవలా చిత్రానికి అగ్రశ్రేణి సాంకేతికవర్గం పని చేస్తుంది.

ఎన్నాళ్లనుంచో అక్కినేనిగారితో చిత్రం నిర్మించాలన్న నిర్మాత గోపాలకృష్ణారెడ్డిగారికి, ఆరోజు రానేవచ్చింది. — శ్రీనివాస్ ●





# సామాన్యుని సణుగుడు

## అరిగిపోయిన పండుగలు

ఏం(విటో మన పండుగలు రాను రాను అరిగిపోయి క్షీణించిపోతున్నాయి — ఆఫీసులకు శలవులివ్వడం — ప్రత్యేకంగా మ్యాటనీలు వేయడం — పత్రికల్లో స్పెషల్ అడ్వర్టైజ్మెంట్లు వేయడం — యింతే తప్ప — పండగకి పండుగకీ తేడాయే లేదు.

ఓ కిలో పంచదార, ఓ అరకిలో వంటనూనె ఎక్స్ట్రా దొరుకుతుందా? అన్న వేటలో వున్నవాళ్ళు చుట్టాలతో పక్కాలతో స్నేహితులతో పండుగ జల్సాలేం చేస్తారూ? అని వాపోయాడో పెద్దకాలపాయన.

ఋతువులతో, పంట రాకడనిబట్టి ఏర్పడ్డ పండుగలు — సేద్య పద్ధతులు మారిపోవడంతో— వెనుకపడ్డాయి రాజకీయాలవల్ల కొన్ని — దేశానికి స్వతంత్రం వచ్చాకా కులమత ప్రాతిపదికను చెరిపివేసే ప్రయత్నంతో ఆయా మతాలకి, కులాలకి, ప్రాంతాలకి కేటాయించిన పండుగలు కొన్ని — యివన్నీ వొచ్చిపడ్డాయి. పాత పండుగలు గూనవాసన, కొడుతున్నాయి మరి!

ఇప్పుడు మన పెద్ద పండుగలన్నీ అరిగిపోయాయి. యుగ యుగాలుగా జనాలు చేసుకుంటున్న యీ వేడుకలకి పట్నవాసాన అర్థం తెలియకుండా పోయింది. వాటి అవసరంకూడా లేకుండా పోయింది లేకపోతే మునుపు వినాయక చవితినాడు దీపావళి పండుగ హడావుడి ప్రారంభమయ్యేది 'ఢన్ ఢన్' మన్న చప్పుళ్ళు దసరా వేళకి మంచి పాకాన పడేవికాని అలాంటిదేం లేదు ఇప్పుడు దీపావళికేం సినిమాలు విడుదల చేస్తారు? దసరాకి పత్రికల్లో ప్రత్యేక సీరియల్సు, సినిమా శీర్షిక లున్నాయా? లేవా? అన్నది చూడ్డమేగాని. కుర్రకుంకలు, తాళంచేతులు పట్టుకుపోయి మేకూ: దారం పెట్టి రోలూ రోకళ్ళు చేస్తున్నారా? — దసరా దశమికి తెల్లారగట్ల లేచి సినిమా ధియేటర్ దగ్గరకి పోయి క్యూలో పడిగాపులు పడుతున్నారే తప్ప — బాణాలు పట్టుకుని వాళ్ళ టీచర్ల వెంట జయీభవ; దిగ్విజయీభవా అంటూ వూరేగింపులు చేశారా?

జీతాలు పెంచండి అన్న అట్టకర్రలు పట్టుకు 'తిరగండయ్యా' అంటే తిరుగుతారు అయ్యవార్లు. "పరీక్షలు వద్దు మార్కులు కలపాలి" అని తిరుగమంటే తిరుగుతారు పిల్లకాయలు అది సరే! యీ బాణాలు పట్టుకుని ఎందుకుటా తిరగడం? అని ఒకవేళ వాళ్ళు అడిగినా చెప్పడం చేతనైన పెద్దవాళ్ళూ లేరు.

అందుకే గవర్నమెంటు సాంక్షన్లో వున్న 'జయంతులు', వార్షికోత్సవాలే గాని తతిమ్మా పండుగలు మతపరమైనవి కనుక వాటికి యిలా కాలదోషం పట్టేస్తుందేమో! భూమిమీద, కులవృత్తిమీదా కాదు యివాళ అధిక సంఖ్యాకులు బ్రతికేది. ఉద్యోగ పరిశ్రమలమీద — అంచేతనే మట్టిమీదా, వృత్తిమీద ఆధారపడే పండుగలు క్రమేపీ అంతరించిపోతున్నాయికాని దసరాకి "మామూళ్ళు" అడిగే ఆచారం, దీపావళికి బాణసంచా తగలెయ్యే సంప్రదాయం మాత్రం ఎన్ని అరిగిపోయినా అరుగదు కనుక — "పండుగకి హోటల్లో భోజనం చేసేద్దాం పిల్లలతో సినిమాకి వెళ్దాం" అని పట్నవాసపు యిల్లాలు కోరిక నెరవేరదు — మర్నాడు వుదయమైనా సరే — పిండివంటల మామ్మూళ్ళు; పెప్పుణ్ణాం మామూళ్ళు డబ్బుల కోటా వసూలు చేసేవాళ్ళు మాత్రం అది చేయక మానరు. వాళ్ళని తప్పించుకోలేం.

అందుకే కుర్రవాడు పండుగ పండుగకీ పులిహోరా, ముద్దపప్పూ, బూరెలు ఏమిటి హాయిగా వార పత్రిక చూసి, జాంగ్రీలు, వెజిటెబుల్ పలావు, జీడిపప్పు పకోడీలు చేయక? అని పోరు పెడుతున్నా తల్లి 'నలుగురికీ పెట్టాలి! అవన్నీ చేసిపెడితే మీ నాన్న కర్ర పట్టుకు సన్యాసుల్లో కలుస్తారు. అంచేత కావాలంటే మీకు డబ్బులిస్తాను పోయి కొనుక్కొని తినండి మీ స్వీట్లు — నా మనాన నన్ను ఈ పెట్టుబడుల వంటకాలే చేయనివ్వండి!" అంటుంది

ఏమండీ దసరాకి అడ్వాన్సు పెట్టేరే కాదు దీపావళికైనా పెట్టండీ — పిల్లకాయలకైనా కొత్త బట్టలు కుట్టిద్దాం' — అంటుంది ఇల్లాలు "సరే! అడ్వాన్సులమీద పండుగలు చేసుకునే రోజుల్లో నాకు చీర, మీకు కోటూ ఎలా వొస్తాయి? కనుక అసలు అడగనేలేదు" అంటుంది. ఆ యిల్లాలు వితరణగా కాని సంక్రాంతిదాకా యీ అడ్వాన్స్ తీర్చేయాలి కాకపోతే దానికి 'లోను' ఎవరిస్తారు కనుక గప్‌చిప్‌పటాకాయలతో సరిపెట్టు కొత్త బట్టలు కాలిపోతాయి— వద్దు — యీ పండుగ దీపాల పండుగేగా' అని సర్దిచెప్పు పిల్లలికి" అంటాడు యజమాని — యీ డైలాగులు మాత్రం అరిగిపోయినా వినపడుతూన్న పాత గ్రామఫోను రికార్డుల్లాంటివి వినపడుతూనే వుంటాయి

ఇంతకీ యీ సొద అంతా 'మధ్య తరగతి' అంటే పాత "యింటర్ క్లాసు టికెట్" జాతిగోల అన్నమాట! అయితే యింటర్ క్లాసుమా ఎత్తేశారు — సెకండు క్లాసునీ ఎత్తేశారు పైగా థర్డ్ క్లాసుని సెకండు క్లాసు చేసేశారు. ఆ విధంగా రైలుబండ్లలో మధ్య తరగతిని చెరిపేశారు కాని సమాజంలో మాత్రం వాళ్ళు యింకా చెరిగిపోలేదే? పత్రికల ప్రత్యేక సంచికల ధరలు కూడా ఏటా పెరిగే యీ రోజుల్లో టపాకాయలు పెరగవా? అవి తప్పకుండా పెరుగుతాయి. కాని యిరుగు పొరుగూ ఏమైనా అనుకుంటారు కనుక "యీమ్మని బాణసంచా కాల్చాల్సిందే" మనం. ఇంతకీ దీపావళికి యీ ఏడాది కొత్త బయిస్కోపులెన్ని విడుదల అవుతాయి? అందులో మన అభిమాన నటుడివి ఎన్ని? అన్న లెక్కలు మీ యింట్లో యువతరం వుంటే మీకు శ్రమ లేకుండా తెల్సిపోతుంది లేకపోతేమాత్రం ప్రక్కవాళ్ళ 'పేపర్' అడగండి అదయితే మీరు చూసి చదివేదాకా ఎవ్వరూ మిమ్మల్ని 'డిస్టర్బ్' చేయరు — సొంతగా కొంటేనే యిబ్బంది తలా ఒక ముక్కా పట్టుకుపోయి...

— విరాజి



అధిక కోకో పోషకత్వం

అధిక కోకో రుచి

క్రొత్త

# బోర్న్‌విటా అధిక కోకో గలది !

బోర్న్‌విటాలో ఎప్పుడూ ఏ ఇతర మాల్టెడ్ ఆరోగ్య పానీయములో కన్నా అధికంగా కోకో ఉన్నది మరి ఇప్పుడు బోర్న్‌విటాలో అంతకన్నా ఎక్కువ కోకో ఉన్నది దాని ఇతోధిక పోషకత్వం కోసం—మరియు ఇదివరకు కన్నా మరింత రుచికరంగా ఉండేందుకు

బోర్న్‌విటాలోని కోకో రక్తవృద్ధినిచ్చు ఐరన్‌తో సమృద్ధమైనది మరియు దానిలో విటమిన్ బి & డి మరియు కేల్షియం, ఫాస్ఫరస్, సోడియం మరియు పొటాషియం వంటి అమూల్యమైన ఖనిజ లవణాలు కూడా ఉన్నాయి వీటికి తోడు బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది

మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి, రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది మీకూ బోర్న్‌విటా అవసరం...వారికి తగ్గట్టుగా ఉండేందుకు !




**75 పైసలు ఆదా చేయండి**

బోర్న్‌విటా మీకు 75 పైసలు ఆదాచేసే 450 గ్రాముల రీఫిల్ ప్యాక్‌లో కూడా దొరుకుతుంది. ఈ ప్యాక్ తెరవగానే దానిలోని పదార్థాలను వెంటనే మామూలు బోర్న్‌విటా డబ్బాలోనికి పోయండి. దాని తాజాదనాన్ని నిలిపేందుకు.

క్యాడ్‌బరీస్

## బోర్న్‌విటా

**అధిక కోకో, అధిక శక్తి, అధిక రుచి**

OBM 6714 TL

## పెద్ద కథ

# మజిలీ

రామా చంద్రమౌళి

*( గత సంచిక తరువాయి )*

"డాక్టర్ మెహతా లేడా ఊళ్లో-"

'హైద్రాబాద్‌లోని హోటల్లో ఏర్ కండిషనింగ్ ఎక్విప్‌మెంటేదో పాడైపోయిందట. ఊరెళ్లాడు. రేపొస్తాడనుకుంటాను '

'ఆయన లేనప్పుడు సినిమాకెందుకు వెళ్లడం ఇలా మనిద్దరిని ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు...'

'ఆయన లేడు కాబట్టే సినిమా కెళ్దామనుకుంటున్నాను నీతో. ఎవరైనా చూస్తే ఏమనుకుంటారేమిటి .. ఫూల్స్... అనుకోనీ డబ్బున్న మనిషి గురించి చెడుగా అనుకుంటానికి ఎన్ని గుండెలుండాలి జనానికి '

'ఎ నైట్ ఇన్ పారిస్' ఇంగ్లీష్ సినిమా. చాలా రోజులనుండే ఆడుతున్నట్టున్నది జనం ఎక్కువగా లేరు. బాల్కని క్లాస్‌లో తాము తప్పితే ఇంకెవరూ లేరు

సరోజిని చూపుతున్న చొరవను చూస్తూంటే ఆమె తనగురించి 'ఆ'విధంగా అనుకోవడం లేదుగదా ..

'ఆ విధంగా' అంటే...

ఓ ఆడా, మగా మధ్య ఉండే సంబంధం గురించేనా అనుకోవడం అంటే.. అంతే .

ప్చ్...ఏమో సందిగ్ధంగా ఉంది పరిస్థితి. సరోజిని గురించి నిక్కచ్చిగా 'ఇలా' అని అనుకునేందుకు వీల్లేకుండా ఉంది ఆమె ప్రవర్తన.

అప్పటికే సినిమా స్టార్టయింది. హాలంతా చీకటి

తనూ ఆమే ప్రక్క ప్రక్కనే ఒంటరిగా చీకట్లో

సరోజ దగ్గరినుండి సన్నగా పూలవాన... వయసు వాసన వెచ్చగా కొత్తగా హాయిగా ఏదో చిత్రానుభూతి. ఏవేవో కొత్త ఆలోచనలు పురులు విప్పుకుంటున్నాయి ఊహలు తూనీగల్లా హృదయంమీద ఎగురుతున్నాయి

సినిమాలో ఏదో మ్యాడ్ సీనొచ్చింది.

చటుక్కున సరోజిని వంక చూశాడు మూర్తి. ఆమెకూడా అతనివంకే చూచింది అప్రయత్నంగా చూపులు ఢీకొని, అనుభూతులు విచ్చుకుని, కళ్లు తళుక్కుమని చిన్నగా నవ్వుకున్నారిద్దరూ.

ఇంకేదో నగ్న దృశ్య మొచ్చింది. క్లబ్బు సీను. కాబరే డాన్సర్ దాదాపు ఒంటిమీద బట్టలు లేకుండానే నృత్యం చేస్తోంది మెరుపులా. బ్రా లేదు బికినీలేదు మొలలో ఏవో పూసల్లాంటి దారాలు వ్రేలాడుతున్నాయి. ఆ దారాలు కదులుతున్నప్పుడల్లా ప్రేక్షకులందరూ ఏం కనిపిస్తుందోనని పడిపడి చూస్తున్నారు

మెల్లగా సరోజిని చేయిని నొక్కాడు మూర్తి ఏమీ అనలేదామె. మెల్లగా నిమురుతున్నాడు, తెరదిక్కే చూస్తూ. ఆమె కూడా అతని చేయిపై చేయి వేసి వ్రేళ్లని గుప్పిట్లోకి తీసుకుని మీటుతూ . ముఖాలు చూచుకున్నారు చటుక్కున.

కన్నుల్లో కోరిక.

చూపుల్లో దాహం

పెదవుల్లో తాపం

తహతహ...తపన...వాంఛ

తాదాత్మ్యం. పరవశం, కలలు కలలు.

ఆమె భుజంపై చేయివేసి దగ్గరగా హత్తుకున్నాడు ఆవేశంగా.

ఆమె అతనిపై వాలిపోయి సన్నగా గోముగా మూల్గుతూ నవ్వి 'ఇంటికెళ్దాం పద' అంది

'ఇంటికా'

'ఊఁ అక్కడైతే అడ్డులేరు మనకెవరూ.'

'పద.'

గబగబా బైటికొచ్చారిద్దరూ. మూర్తి స్టీరింగు తీసుకున్నాడు

ఐదు నిముషాల్లో సరోజిని ఇల్లొచ్చింది.

వెండి ఇటుకలతో కట్టిన బిల్డింగ్. లోపల పాలరాతి నేల. ఇంటినిండా నిశ్శబ్ద సంగీతం.

బెడ్‌రూంలోకి తీసుకుపోయింది.

ఎదురుగా తెల్లని ఫోమ్ బెడ్. గోడలపై ఖజురహో చిత్రాలు. ప్రక్కన నిలువుటద్దం. దాపునే సరోజిని. సరోజిని కవ్వించే కళ్లు. వూరించే ఒళ్లు. రా రమ్మని పిలిచే వయసు.

చటుక్కున ఆమెను కౌగిట్లోకి లాక్కుని బెడ్ వైపుకు నడిపించుకుపోయాడు.

## 5

'డియర్ ఫ్రెండ్స్. ఐయామ్ వెరీ గ్లాడ్ టు ఇనాగరేట్ దిస్ న్యూ బీడీ ఇండస్ట్రీ. నేమ్లీ ది జీరో జీరో జీరో బీడీ. ఐ విష్ ది ఇండస్ట్రీ ప్రాస్పర్స్ వెల్ ఎండ్ ది ప్రొప్ర



'మనసున్న మనిషి'లో శివాజీ, విజయ

యిటర్ మిస్టర్ మూర్తి ఫెచెస్ వెల్. థాంక్యూ...థాంక్స్ టు వన్ ఎండాల్' కలెక్టర్ ప్రారంభోత్సవం చేశాడు. రిబ్బన్ తెగిపోయింది.

గేట్ పైన మూడు సున్నాల గుర్తున్న లైట్లు చమక్కున మెరిశాయి.

కలెక్టర్ చుట్టూ జెంటిల్‌మెన్ అందరూ ఉన్నారు లోపలంతా బీడీ పరిశ్రమకు సంబంధించిన కార్మికులూ ఉన్నారు

మూర్తి స్వయంగా కలెక్టర్‌గారిని లోపలికి తీసుకెళ్ళాడు. అతని వెంబడి మిసెస్ సరోజినీ, డాక్టర్ మెహతా, విశాలా, నాయర్ ఎందరో...

బయట కూలీలకు మిఠాయిలు పంచిపెట్టారు.

లోపల అతిథులకు కూల్ డ్రింక్స్, స్వీట్స్ వగైరా వగైరా.

'తననుకున్నదాన్ని అనుకున్నట్టుగా ఇంత త్వరలో ఈ నెలరోజుల వ్యవధిలోనే చేతిలో ఒక్క పైసా లేకుండా ఎంత చాకచక్యంగా స్టార్ట్ చేయగలిగాడు తను. ఐయామ్ ప్రౌడాఫ్ మై సెల్ఫ్' మూర్తి లోలోపలే గర్వంగా నవ్వుకుని పూర్తి అధికారంతో సరోజిని వంక చూశాడు. ఆమె కూడా నవ్వింది మెత్తగా

ఓ పావుగంటలో టీ పార్టీ ముగిసింది.

జెంటిల్‌మెన్ పార్టీ ఇహ ప్రారంభం కావాలి. అందుకు లోపల ఏర్పాట్లన్నీ చురుగ్గా సాగుతున్నాయి.

ఎవరికివారు ముచ్చట్లలో మునిగిపోయారు

విశాల అప్పటినుండీ శంకర్రావు కోసం ఎదురు చూస్తోంది అప్పటికే ప్రొద్దుటినుండి రెండుసార్లు తనికి ఫోన్ కూడా చేసింది తప్పనిసరిగా వస్తానని చెప్పి కూడా ఇంతవరకు రాలేదు ఎందుకో...ఎందుకో.

శంకర్రావు ఎల్. ఐ. సీ జోనల్ ఆఫీసర్.

విశాల కొద్ది రోజులనుండి క్లబ్బుకివస్తూ శంకర్రావుకు దగ్గరవడం మూర్తికి ఎంతో సంతోషంగా ఉంది. మిసెస్ సరోజిని తనకు దగ్గరౌతున్న కొద్దీ ఏదో విసుగ్గా విశాల తననుండి దూరమై పోవడం ఆనందంగా ఉందతనికి.

ఐనా విశాకు శంకర్రావుతో పనేముంది. ఐనా పని ఉంటేనే స్నేహం చేసే మనిషి కాదులే ఆమె స్ప్రెసోనీ.

అంతా సిద్ధమై ఇహ 'చీర్స్' చెప్పేటప్పటికు పరుగెత్తుకొచ్చాడు శంకర్రావు హావిడిగా.

వచ్చి, "ఐయామ్ వెరీ సారీ విశాలా టైముకి రాలేకపోయాను. మీ జనరల్ స్టోర్సు ఇనాగరేషన్ కూడా ఐపోయిందా." అన్నాడు ఒగరుస్తూ.

'అది ఉదయమే అయిపోయింది. ఈ సాయంకాలం బీడీ ఇండస్ట్రీ'

'వెరీసారీ వెరీసారీ .. ఓ కోట అనుకోకుండా ఓ ఇన్సూరెన్స్ గిరాకీ తగిలింది. కేసు యాభై వేలది మంచిది చూస్తూ చూస్తూ పోగొట్టుకోలేను. యిక్కడేమో ఈ కార్యక్రమం వుంది. దానికోసం ఆ పల్లెటూరు వెళ్ళి, పరిగెత్తుకుంటూ వచ్చేసరికి ఇదిగో ఈ వేళ అయింది ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మీ.'

'ట్రాఫిక్ పోలీసు వాళ్ళు, ఈ యల్ ఐ సి ఏజెంట్‌లు మనిషిని పట్టుకున్నారంటే వదలరు కదా ఓ మానంగా ... ఇంతకు యాభై వేల యిన్సూరెన్స్ గురించి ఇంత పట్టింపు ఎందుకు ' విశాల మొహంలోకి బలవంతంగా తీవిని. లాక్కొచ్చుకుంటోంది

'అదేమిటండీ ... యాభై వేల గిరాకీని పట్టించుకోవద్దంటారు...'

వెలుగురవ్వల అలజడి



-ఫోటో : ఎస్. రామయ్య

'అంటే.. అదంత పెద్ద మొత్తమని మీ ఉద్దేశ్యమా.'

'మరి కాదా.'

'ఐతే...రేపే మీకింకో యాభై వేల కేస్ చిప్పిస్తాను.'

'రియల్లీ...నిజంగానా విశాలా ... ఎక్కడుంది కేస్.'

'ఎక్కడుందేమిటి ... రేప్పొద్దున మా యింటికి రండి నే నిప్పిస్తానా గిరాకీని'

'పిల్లవాని ముందు మిఠాయి పెట్టి రేపు తిందువుగానిలే అన్నట్టుంది మీరు చెప్పేది... ప్లీజ్ చెప్పండి...ఎవరాయన.'

'ఆయనేమిటి...ఆమె కాకూడదా.'

'అఫ్‌కోర్స్.. ఎవరు.'

'నేనే–'

'మీరింకా లైఫ్ ఇన్సూర్ చెయ్యనేలేదా... ఓ మైగాడ్ ... మరి నేనానాటినుండేం జేస్తున్నట్టు.'

'నేను ఎర్నింగ్ మెంబరైంది ఇవ్వాల్టినుండే...అది చూడ్డంలేదు మీకు'

'ఓ...అదొకటుందికదూ...ఊఁ ... ఐతే ఐతే...మరి ఎప్పుడు కలవను మీకు.'

'చూస్తుంటే యిప్పుడే ఫారం నింపెయ్యమనేటట్టున్నారు ... రేప్పొద్దున్నే రండి మా యింటికి చేసేద్దాం...'

ఇంతలో బాయ్‌తో ట్రే పట్టించుకుని వచ్చాడు మూర్తి...'హలో' అంటూ.

'హలో...కంగ్రాచ్యులేషన్స్...'

'థాంక్యూ...కమాన్ హావిట్ ..' ట్రేలోని లిక్కర్స్ దిక్కు చూపించాడు.

## 6

అద్దంలో ముఖాన్ని చూచుకుంది విశాల. కుడికన్ను ఎరుపెక్కి కొద్దిగా వాచి నిప్పు పువ్వులా తయారైంది.

ప్రొద్దున్నే కంట్లో ఏదో నలుసు పడితే అదే పోతుందిలే అని ఊరుకుంది. దురదలా అనిపిస్తే అప్పుడప్పుడు చేతితో నలిపింది కూడా. సాయంత్రానికల్లా కన్ను ఎర్రగా, కొంచెం నొప్పిగా అనిపించింది. అది చూచి మూర్తి డాక్టర్ మెహతా నర్సింగ్ హోంకు వెళ్ళి చూపించుకోరాదూ అన్నాడు

వెళ్లి చూపించుకోరాదూ అన్నాడుగాని కలిసే ఇద్దరమూ వెళ్దాం పద-అని మాత్రం అనలేదు.

ఔనులే ... ఎందుకంటాడు ... ఆరు

# గోద్రెజ్ స్టోర్‌వెల్

## ఈ స్టీల్ అల్మారాలకు సరితూగేలాగ తయారు చేద్దామని ప్రయత్నం మిగతా వాళ్ళంతా!

దీని లోపల ప్రత్యేకమైన లాకర్ డిజైను వల్ల మీకు అదనపు రక్షణ.

కొన్ని ఏళ్ళుగా గోద్రెజ్ వారు అత్యున్నతమైన స్టీలు అల్మారాలు తయారు చేస్తున్నారు. నిజానికి స్టాండర్డ్ స్టోర్‌వెల్ శ్రేణిలో 6 రకాలు. స్టోర్‌వెల్ మైనర్ శ్రేణిలో రెండు రకాలు—యీ మధ్యనే స్టోర్‌వెల్ కాంపాక్టు పూర్తి శ్రేణి తయారు చేసారు. అంతేగాక, అన్నిటికన్న ఎక్కువ జాగా గలిగిన, ఆధునికంగా రూపొందించిన స్టోర్‌వెల్ వాటితోబాటు చేర్చారు.

ఇప్పటిదాకా మిగతా వాళ్ళు గోద్రెజ్ నాణ్యతతో సరితూగేలాగ తయారు చెయ్యాలని ప్రయత్నం—గోద్రెజ్ డిజైనుతో సరిసమానంగా ఉండేలాగ చెయ్యాలని. కాని మేమే ఎప్పుడూ ముందంజ వేస్తున్నాం. నిజానికి యిది కష్టసాధ్యమే. అయినా, పట్టు శ్రమకు ఫలితం ఉంది మరి. మీకు ఎంతో మేలైన స్టోర్‌వెల్ అల్మారా యివ్వటం మా ధ్యేయం అయినప్పుడు యిది మరీ ముఖ్యమని మా ఉద్దేశ్యం.

నిజానికి చూస్తే, మా పద్ధతి మొదట్నుంచీ యిదే.

స్టోర్‌వెల్ అల్మారాని అంతర్గతంగా బలంగా ఉండేలాగ చెయ్యడంతో మొదలైంది యిదంతా. మృదువుగా ఉండే మెరిసే పెయింట్ పొరం వెనక, తుప్పు నిరోధించే, జీవితాంతం నిశ్చింతగా పనిచేసే ఆకారం ఉంది.

అధిక భద్రత కోసంగాను సునిశితమైన పద్ధతితో కొత్తగా '3-వే బోల్టింగ్ డివైస్' రూపొందించి, దానికి ఎవ్వరూ తియ్యలేని గోద్రెజ్ తాళాన్ని బిగించాము.

మరికొన్ని కొత్త సదుపాయాన్ని అమర్చాం దీనిలో. స్పెషల్ ఛానల్ గ్రిప్ లాకర్, ఎవ్వరూ పగలగొట్టలేని తలుపు బందులు, దాని తోబాటు గుండ్రని చివరలు పొందుపరిచాము.

మేము కొత్తది ఏదైనా ప్రవేశపెడితే చాలు, మిగతా వాళ్ళు దానినే అనుసరించటం సమంజసంగా భావించారు.

కాని అది అంతవరకే—వాళ్ళు అంత తేలికగా అనుసరించడానికి వీల్లేని కొన్ని అంశాలున్నాయి మరి.

మేము తయారుచేసే ముఖ్యమైన ప్రతి స్థాయిలోనూ సూటికి నూరు పాళ్ళు పర్యవేక్షణ అందులో ముఖ్యమైన అంశం—మరొకరు అనుసరించటం అంత తేలిక కానిది అది.

కొత్త పద్ధతులు కనిపెట్టడంలో గోద్రెజ్ వారి ఉత్సాహంతో కూడిన కౌశలం మరొక అంశం.

మేము తీసుకొచ్చే వికాసాన్ని బలపర్చడానికి పూర్తి సౌకర్యాలున్న మా పరిశోధనా విభాగం మాకున్న ప్రత్యేకతల్లో మరొకటి.

నిజానికి చూస్తే, నాణ్యత విషయంలో అందరికన్న మేమే మా ముఖ్యమైన ప్రతిస్పర్థులం.



స్టోర్‌వెల్ మోడల్ 1
—నిగుమతి చేయబడిన నిలువుటద్దం—మీ రూపాన్ని పూర్తిగా చూసుకోవడం కోసం వీలైనది.



స్టోర్‌వెల్ మోడల్ 2

### కొత్త 'కాంపాక్టు' అల్మారాలు



స్టాండర్డ్ స్టోర్‌వెల్ అంత లోతు, స్టోర్‌వెల్ నాణ్యతతో. అదిగాక మీరు ఎంచుకోవటానికి ఆరు డిజైన్లు. అయినా కొంచెం పొట్టిగా, కొంచెం కోసుగా—తక్కువ జాగా వున్నప్పుడూ, పరిమితమైన ఖర్చు చెయ్యగలిగిన యిళ్ళుగల వాళ్ళ కోసం ఎంతో వీలు.

కొత్త స్టోర్‌వెల్ 'వార్డ్‌రోబ్': స్టాండర్డ్ సైజు దానికన్నా ఎక్కువ లోతైనది, విశాలమైనది. అంటె సూట్ల కోసం, బట్టల కోసం మరింత ఎక్కువ జాగా లోపలే లాకర్ ఏర్పాటు, మార్చుకోవడానికి వీలైన అరలతో.





స్టోర్‌వెల్ మైనర్
—లాకర్‌తో గాని లేదా లాకర్ లేకుండా గాని.

ప్రఖ్యాతి చెందిన వస్తువులు నిర్మించేవారు—
గోద్రెజ్
Godrej®

## ఉచితం!

### గోద్రెజ్ స్టోర్‌వెల్ ఫోల్డర్

పేరికి వ్రాయండి:
గోద్రెజ్ ఎండ్ బాయిస్ మేన్యు. కం. ప్రై. లి.
4ఎ. హ్యూమ్ స్ట్రీట్, ఫోర్ట్, బొంబాయి 400 001.

స్టోర్‌వెల్—నాలుగు అరలు గలది ఇప్పుడు కేంద్ర ప్రభుత్వ శాఖలకు డి.జి.ఎస్. అండ్ డి.రేట్ కాంట్రాక్టు ద్వారా లభ్యమవుతోంది.

U-GS-16-6 TEL

కలిపి...ప్స్...పోనీలే.

ఆసలీ మధ్య మూర్తితో సరోజిని ప్రవర్తన బాహాటంగానే హద్దులు మీరిపోతోంది. ఇద్దరి ఎడుమ అన్నిరకాల సంబంధాలూ బలపడ్డట్టే ఉన్నాయి. అక్కడ భర్తను అందులో అస్తి పాస్తులూ, అందచందాలూ అన్నీఉన్న భర్తను విడిచిపెట్టి పరాయి మగాడితో ఈమెకీ ఆయ్యాటలేమిటి.

నిజంగానే భర్త ఈమెను అంత ఘోరంగా నిలక్ష్యం చేస్తున్నాడా ఈమెను పట్టించుకోకుండా తన సంగతేమిటో తను చూచుకుంటున్నాడా

ఒకవేళ నిజంగానే మగాడు అలా చేసేట్లయితే ఆడది ఇలా దారితప్పి ఇష్టమున్నట్టు తిరగడం ఎంతవరకు సమంజసం ఐతే డాక్టర్ మెహతాను తను ఎరిగున్నంత మేరకు తను కూడా ఏమంత మంచి మనిషిలా కనిపించలేదు అతని చూపుల్లో దాహం ... నవ్వులో విషం... మాటల్లో కోరిక ..చేతల్లో కాంక్ష ... ఇవన్నీ చూస్తుంటే ఆయన మనుషుల్లో రాక్షసునిలా కనిపించాడు

ఇంతకూ డాక్టర్ మెహతాకు ఈ సరోజినీ, మూర్తిల సంగతి తెలుసా తెలిసిన నాడేమౌతుంది అతనేంజేస్తాడు

గొప్పవాళ్ళెప్పుడూ మనుషులను బతికిస్తారు, కాకుంటే చడీచప్పుడు లేకుండా చంపిస్తారు. అంతేగాని ఊరికే వీధిలోపడి అల్లరి చేయరు. అల్లరిపాలు కారు.

సరే ... ఓసారి మెహతా నర్సింగ్‌హోంకి వెళ్ళొస్తే అతన్నీ, అతని సంగతినీ, తన కంటితో సంగతినీ చూచినట్టవుతుంది.

మూర్తితో చెప్పి అతను కారును తీసుకుపొమ్మంటే వద్దని బయటికొచ్చి రిక్షా ఎక్కి నర్సింగ్‌హోందిక్కు బయలుదేరింది విశాల

ఆమె క్లినిక్‌లోకి వెళ్ళగానే ఎప్పుడూ ఎదురుగా కనిపించే మెహతా బ్లూ కారు కనిపించలేదు

అతని అసిస్టెంట్స్‌లో ఎవరో కనిపిస్తే అడిగింది మెహతా గురించి.

'ఇవ్వాళ ఆయన రాలేదండీ క్లినిక్కు. ప్రొద్దున్నే ఎవరో అమ్మాయొస్తే ఆమెవెంట వెళ్ళాడు. సాయంకాలం వస్తానన్నాడు వస్తాడేమో మరి కూర్చుంటారా' అన్నాడు.

అమ్మాయితో వెళ్ళాడా .. అమ్మాయితో ఎక్కడికి ఎందుకు...ప్స్...ఏమో...ఏ వి... ఏమాలోచనలివి.

'ఇంటికి ఫోన్ చేస్తారా...'

'మీరే చేసి కనుక్కోండి మమ్మల్ని కోప్పడుతాడు డిస్టర్బ్ చేస్తే.'

'ఈజిట్ . దెన్ ప్లీజ్ రింగప్'

డాక్టర్ లైన్ కలుపుతున్నాడు.

చుట్టూ ఎన్నో గదులూ ఎందరో పేషంట్స్ - ఇంత సంస్థను పెట్టుకుని, ఇంత పవిత్రమైన వృత్తిలో ఉంటూ డాక్టర్ మెహతా వ్యక్తిత్వాన్ని చంపుకుంటున్నాడు... నైతికంగా పతనమైపోతున్నట్టున్నాడు.

అన్నీ తెలిసిన ఈ చదువుకున్న మనుషులు

తెలుసుకోవాలనే తపనతో ఉన్నాం.

'యస్ మేడమ్ హి ఈజ్ స్పీకింగ్' రిసీవర్ నందించాడు

'యస్ విశాలా హియర్ ... 'గుడీవినింగ్ డాక్టర్.'

'ఓ .. గుడీవినింగ్ ఏమిటీ చెప్పండి విశేషం, మీరు మా నర్సింగ్‌హోంకు వచ్చారట అది పావనమైపోయింది అలాగే మాగృహాన్ని కూడా పావనం చేయండి '

'అదేంలేదు కొద్దిగా కంట్లో నలుసుపడి ట్రబులిస్తుంటేనూ '

'దెన్...కమాన్ మా యింటికి రండి... ఇక్కడె ఎగ్జామిన్ చేద్దాం.'

'ఎందుకండీ ఓ చిన్న విషయానికి ఇక్కడే మీ అసిస్టెంటెవరన్నా చూస్తార్లెండి.'

'ఫర్వాలేదు విశాలా మా యింటికి రా... యిక్కడే కలిసి కాఫీ తాగుదాం ... ఇవ్వాళేం మూడ్ బాగాలేదు కంపెనీ యివ్వు.'

'ఎందుకు లెండి '

'నో నో... మీరు తప్పకుండా రావాలి. నేను మీకోసం ఎదురు చూస్తుంటాను-'

'. ' విశాల ఇంకేదో అనబోయింది. కాని ఇంతలో మెహతా ఫోన్ పెట్టేశాడు.

ఇప్పుడేం జేయాలి వెళ్ళాలా వద్దా...

బయటికొచ్చి రిక్షా ఎక్కింది.

ఇంటిదగ్గర సరోజినుందో

టైమ్ చూచుకుంది ఒరున్నర దాటింది ఇప్పుడెక్కడుంటుందామె ఇంట్లో... మూర్తి దగ్గరనో మూర్తి కౌగిట్లోనో-

ప్స్ ఐనా ఆమె పక్కనుంటే కంపెనీ లేదని అతడెందుకంటాడు.

ఓ పదినిముషాల తర్వాత మెహతా ఇంటి దగ్గరికొచ్చింది రిక్షా. దిగి రిక్షావాడికి డబ్బులిచ్చి గేట్‌లోకి అడుగు పెట్టబోతుండగా లోపలి నుండి ఓ కారు సరుస దూసుకొచ్చి బయటికి పరుగెత్తిపోయింది

కార్లో ఎవరో అమ్మాయి ఆమె సరోజినైతే కాదు. మరెవరు...ఎవరో-

లోపలికి నడిచిన విశాలకు కారిడార్‌లోనే ఎదురయ్యాడు మెహతా. ఎదురై మామూలు ఫార్మల్ ప్రశ్నలన్నీ వేసి నవ్వుముఖంతో మేడపైన తన గదిలోకి తీసుకుపోయాడు.

హాల్లోనే కూర్చోక మేడపైకెందుకో... పైననే అతని ఎక్విప్‌మెంటుందా ... కాక ఇంకేదన్నా పాడాలోచన - ప్స్ ... చూద్దాం చూద్దాం - విశాల మౌనంగా అతని వెంట నడిచింది.









# మజిలీ

గదిలో కూర్చోగానే నౌకరు కాఫీ పట్టుకొచ్చాడు.

ఇహ ముచ్చట మొదలైంది ... తన ఏర్‌కండిషన్డ్ హోటల్ గురించీ, వంద పడకలున్న నర్సింగ్‌హోం గురించీ మొన్ననే కొన్న కారు గురించి ... చివరికి మిసెస్ సరోజినీ మెహతా గురించీ-ఏదేదో చెబుతున్నాడు.

'దట్ బ్లడీ ఉమెన్ ఈజ్ ఎక్సీడింగ్ హర్ లిమిట్స్ రోజురోజుకు నేనామెను భరించలేక పోతున్నాను. ఆమెది కొద్దిగా స్వంత ఆస్తుందిలే అందుకే బడాయి అహం గర్వం...'

'ఎందుకు మీరామె గురించి అంతగా బాధపడుతున్నారు,'

'అయ్యయ్యో మీకు తెలియదు దట్ డర్టీ రోగ్ మిస్టర్ మూర్తి...ఓసారి నీక్కాబోయే భర్త కదూ'

'నో నో- చెప్పండి నేనతన్ని చేసుకుందామన్న అభిప్రాయాన్ని మార్చుకుంటున్నాను'

'ఈజిట్...ఎందుకు ?'

'అతని ప్రవర్తనేం బాగనిపించడంలేదు-'

'రియల్లీ దటీజ్ ట్రూ, నేనదే చెప్పాలనుకుంటున్నాను మీతో.. వాడూ సరోజినీ కలిసి కలిసి ... వాట్స్ యూ కాలిట్ ... ఏదేదో చేస్తున్నారట...రిగార్డింగ్ దిస్... ఆమెనెన్నో వార్నింగ్స్ ఇచ్చాను. ఐనా లాభంలేదు. ఆమె ఇక అంతే. అందుకే ఓ నిర్ణయానికొచ్చాను. ఆమెకు విడాకులివ్వాలనుకుంటున్నాను. లేకుంటే ఆస్తినంతా పిల్లిపిల్లగా ఆ దౌర్భాగ్యుడికి దత్తం చేసేట్టున్నది-'

'విడాకులా-'

'ఔనూ – అందుకామెకూడా సిద్ధంగా ఉంది. మోరోవర్ షి ఈజ్ వెరీ హాపీ.'

'బట్ వాట్ అబౌట్ సొసైటీ'

'ఐడోంట్ కేర్ ది సొసైటీ. డబ్బున్న మనిషిని ఈ లోకం ఎన్నడూ వేలెత్తి చూపదు.'

'అంటే మీ రిద్దరూ కలిసి తీసుకున్నారా ఈ నిర్ణయాన్ని'

'ఊఁ'

డాక్టర్ మెహతా సడన్‌గా ఆగిపోయి ఆలోచనలో మునిగిపోయాడు.

కాఫీ తాగడం అయిపోయింది-

విశాల ఆలోచిస్తోంది – సరోజిని గురించి మెహతా గురించి మూర్తి గురించి వాళ్ళ వింత తత్వాల గురించి.

'ఆ...హా...చెప్పండి విశాలగారూ' తెప్పరిల్లాడు కాస్సేపటికి నిద్రనుండి ఉలిక్కిపడి లేచినట్టు.

'... ... ...'

'ఏదీ మీ కన్ను అసలేమైంది'

అంతా వివరంగా చెప్పింది విశాల.

'ఏదీ నన్ను చూడనివ్వండి' టార్చిలైటును తీసుకున్నాడు చేతిలోకి.

దగ్గరగా వచ్చి ఎదురుగా మీదుగా వంగి ముఖంపై ముఖం పెట్టి చూస్తూ-

విశాల మనస్సు మరుగుతున్న నీటిలా తయారౌతోంది.

సుందర తెల్లగా అప్పుడే తెంపిన ఆపిల్ పళ్ళలా చెంపలు. తెల్లగా ముఖం. ఊరించే పెదవులు. వాటిపై కొద్దిగా తడి-

డాక్టర్ మెహతా హృదయం కోరికలో మునిగిపోతోంది.

అతను ఇంకా ఇంకా ఆమెకు దగ్గరగా ఇంకా దగ్గరగా.

మెహతా చెంప చెళ్ళుమంది.

ఆడపులిలా లేచింది విశాల. లేచి 'బ్రూట్ సరోజిని పతనానికి నువ్వే కారకుడివను. పడతి పతిదైవమే ప్రాణనాథుని తప్పు అని నీతి శాస్త్రం చెప్తుంటోంది. రోగ్. ఇడియట్' చరచరా బయటకు పరుగెత్తింది విశాల.

వీడొక పశువు.

అదొక దయ్యం—

రిక్షా ఎక్కింది. ఎదురుగా రోడ్డువెంట అంతా చీకటి...చీకటి చీకటి. ఆమె మనసులా వుంది.

ఇంటికొచ్చేసరికి గేట్ తెరిచే వుంది. హస్పెన్ రాలేదు. బయట సరోజిని కారుంది పార్క్ చేసి.

సరోజినీ, మూర్తి లోపలే వున్నట్టున్నారు. ఏంచేస్తున్నారో. ఇప్పుడు తనేం చేయాలి..

మెల్లిమెల్లిగా అడుగు మెట్లదాకా వచ్చింది.

సరిగ్గా సరోజినీ, మూర్తీ మాట్లాడుతున్న మాటలు వినబడుతున్నాయి.

'వాడు విడాకులిస్తానంటున్నాడు' సరోజిని కంఠం.

'ఇవ్వనీ ఇస్తే మనకింకా సంతోషమేగదా. మనం పెళ్ళి చేసుకుందాం హాయిగా' మూర్తి,

'రియల్. నన్ను పెళ్ళి చేసుకుంటావా'

'చేసుకుంటానంటే నువ్వేమనుకుంటావో నని ఆలోచిస్తున్నా ఇన్నాళ్ళూ.'

'నిజం. థాంక్స్. థాంక్స్, మరి విశాలనో'

'విశాలా ఆమె నిజంగా నా గురించి అను కుంటున్నావా. నో. కాదు' నిదానంగా చెబు తున్నాడు.

విశాల నవ్వుతుంది నిశ్శబ్దంగా నిర్లిప్తంగా

'మరి ఎప్పుడు చేసుకుందాం'

'ఆమెను తప్పించాలి మన నుంచి. ఊఁ. అదంతా నేను చూసుకుంటాన్లే'

మోహనా... సరోజినీ. మూర్తి మధ్య ఆటబొమ్మలా తను-

'కొంచెం టైమ్' హుస్సేన్ బయటనుంచి ఇంట్లోకొస్తూ అన్నాడు గేటులో నిలబడ్డ విశాలను చూసి.

విశాల చిన్నగా దగ్గి నెమ్మదిగా హాల్లోకి నడిచింది.

ఎదురుగా మూర్తి సరోజిని నవ్వుతూ – పలకరించారు 'ఇంతసేపయిందేమిటి' అని

విశాల జవాబు చెప్పలేదు. నవ్వింది ఊరుకుంది.

## 7

'విశాల కనపడ్డం లేదు నిన్నా మొన్నటి నుండి' అన్నాడు మూర్తి బయట గదిలో అప్పుడే ఇంట్లోకి వస్తున్న సరోజినితో.

వాళ్ళిద్దరూ ఇంకో వారం రోజుల్లోగ తమ జీవితాల సంగతేమిటో తేల్చేసుకోవాలను కుంటున్నారు. 'ఆ విషయం గురించే వివరంగా మాట్లాడుకుందాం' అని మూర్తి అంటే ఉదయం మోహనా వచ్చిందనుకొంటే వెళ్ళగానే ఉండాయింది తను ఇటు దిక్కు వచ్చింది.

'మన సంగతి గ్రహించి బహూశా తన దారిని తను వెళ్ళిపోతుంది'

'కాని అలా చెప్పకుండా పారిపోయేంత పిరికి మనిషికాదు ఆమె'

'దీంట్లో పిరికితనం. ధైర్యం ప్రదర్శించవలసింది. నువ్వు నన్ను లైక్ చేస్తున్నావని తెలుసుకుని తప్పుకుంది.'

'అవునులే... కానీ...'

'ఏమిటీ ఆమె వెళ్ళిపోవడంవల్ల నీకు బాధనిపిస్తోందా'

'బాధ అని కాదుగాని అదోలాంటిదే ఏదో అనుభూతి కలుగుతోంది. మొత్తానికామె వ్యక్తిత్వమున్న మనిషి. మనసున్న మనిషి కూడా అసలామె ఎందుకొచ్చిందో ఎందు కెళ్ళిందో'

'పోనీలెద్దూ అనవసరంగా మనకెందుకు ఎవరి బతుకు వాళ్ళది'

ఇద్దరూ మెట్లెక్కి లోపలికి వెళ్ళ బోతూండగా వెనుక నుంచి "పోస్ట్" అన్న కేక వినబడింది.

కవరు తీసుకొని విప్పాడు.

శ్రీ మూర్తి గార్కి,

నమస్కారం,

నేను మీ దగ్గరున్న ఈ నాల్గు నెలలూ మిమ్మల్ని చదవడం...నా గురించి నేను ఆలో చించడం...ఏదో ఓ నిర్ణయం కోసం ప్రాకు లాడ్డం వీటితోనే గడచిపోయాయి.

ఇప్పటివరకు మీరు నాకు పూర్తిగా అర్థ మయ్యారుగాని నేను మాత్రం మీ కసలే

తెలియలేదు. తెలుసుకోవాల్సిన అవసరం మీకేర్పడలేదు. చెప్పాల్సిన అవకాశం నాకు కలుగలేదు.

సరే—ఇప్పుడైనా మీకు చెప్పాలనుకుంటున్నాను నా గురించి.

ఇదివరలో నేను మీకు చెప్పినట్టు ఒంటరి దాన్ని కాదు నేను. నా వెనుక ఆర్గురు మనుషులున్నారు.. ఆరు జీవితాలున్నాయి.

నాకు అమ్మలేదు. నాన్నున్నాడు...అతను పోస్ట్ మాన్‌గా చేసేవాడు. ఓ ఎనిమిది నెలల క్రితం రిటైరయ్యాడు. కాగానే ఉద్యోగం పోయింది. పోయి పక్షవాతం వచ్చిందతనికి — అసలు మేం ఐదుగురు ఆడపిల్లలం. నేను మూడవదాన్ని. ఇద్దరక్కలూ హైస్కూలు చదువులు చదివి ఇంటిమీదున్నారు. నేనొక్క దాన్ని ఎంతో శ్రద్ధగా చదువుకునే దాన్ని.

కన్నీళ్ళూ, ఆకలి, బాధలూ, బాధ్యతలూ ఇవన్నీ నన్ను ధారాళంగా చదివించాయి.

చదువే నా లోకం, చదువు నా జీవితం, చదువే నా సర్వస్వంగా గడిపాను బియస్సీలో ఉండగా.

బియస్సీ కావాలి ... కుటుంబాన్ని నా భుజాలమీద నెత్తుకోవాలి—అదే తపన. అదే తహతహ...అదే లక్ష్యం.

కాని బియస్సీ ఇంకో రెండు నెలలకవుతుం దనగానే నాన్న ఉద్యోగం పోయింది. ఆయన పోస్టాఫీస్‌లో నుండి హాస్పిటల్‌కు మారారు.

ప్రతిరోజూ పస్తులు, కన్నీళ్ళూ, ఎటూ తోచని జీవితం చీకటి.

అక్కయ్యలిద్దరూ ఏమీ చేయలేని నిస్సహాయులు. కాస్త వికారులు కూడా.

ఎలా...ఎలా.

ఉన్న వస్తువుల నమ్ముకునీ, వీలయినంత

# మజిలీ

మేరకు అప్పులు చేసీ బియస్సీ ముగించాను.

కాని-తర్వాత తెలిసింది ఈ బియస్సీలూ, ఎమ్మెస్సీలూ మనిషిని బతికించలేవని.

ఏంచేయాలి...ఏంచేయాలి. ఏదో ఒకటి చేయాలి.

పత్రిక ప్రెస్‌లో డైలీ వేజెస్ మీద ప్రూఫ్ రీడర్‌గా చేరాను.

అప్పుడు కనబడ్డారు మీరు మీ ప్రకటనలో మిమ్మల్ని చూడగానే బాగా డబ్బున్న మనిషిలా కనిపించారు. ముఖంలో పలుకుబడి ఉన్న ఛాయలూ, ఆర్భాటమూ కనబడ్డాయి. నేను వధువుగా అప్లై చేస్తేనో అన్న ఆలోచన కలిగింది. కాని తర్వాత సంగతేమౌతుంది ... ఏమో.

ఏదో ఔతుంది. జీవితమనే బావిలోకి దుమికి చూద్దాం ఏమౌతుందో అనుకున్నాను.

తర్వాత ...

నేను మీకు రాయడం, మీరు నన్ను పిలవడం అదంతా జరిగింది.

మిమ్మల్ని కలవడంకోసం వరంగల్ బయలుదేరాను హైదరాబాద్ నుండి — ట్రెయిన్లో ...రైలు తెల్లవారు జామున మూడుగంటలకు చేరింది వరంగల్లు.

చీకటి-ఒంటరితనాన్ని — కొత్త ఊరు. స్టేషన్ బయట రెండో మూడో రిక్షాలున్నాయి. అందులో నుండి ఇద్దరు గబగబా పరుగెత్తుకొచ్చి అడిగారు ఎక్కడికి పోవాలమ్మ గారూ.అని.

ఎక్కడికి పోవాలో — ఇంకా ఏంచేయాలో ఇంకా నిర్ణయించుకో-లేదు నేను. రిక్షా వాళ్ళేమో అదేపనిగా అడుగుతున్నారు. చటుక్కున మీ అడ్రస్ చెప్పాను అప్రయత్నంగానే. కూర్చోమన్నాడు. రిక్షా బయలుదేరింది.

దారి పొడుగునా ఎవరూ లేరు ... అంతా నిశ్శబ్దంగా ఉంది వాతావరణం.

మా రిక్షా వెంబడి—మిగతా ఇద్దరు రిక్షా వాళ్ళు కూడా వస్తున్నారు ఏదేదో పెద్దగా మాట్లాడుకుంటూ.

వాళ్ళెందుకొస్తున్నట్టు—

భయం ... ఒంటరితనం ... చీకటి. నా తెలివి తక్కువ పనికి నాపై నాకే అసహ్యమేసింది ... అసలు నే నా వేళలో బయలుదేరాల్సింది కాదు. స్టేషన్లోనే ఇంకాసేపు కూర్చోవాల్సింది.

రిక్షా పార్కు దాటింది...గోడౌన్స్, గ్రేన్ మార్కెట్ దాటింది.

చీకటి—చీకటి...మనిషి అలికిడి లేదు.

రిక్షాను ఆపారు.

ఎందుకు— ఎందుకు ... చెమటలు పడుతున్నాయి.

ఒకడు—ఇద్దరు...ముగ్గురు — ముగ్గురూ పైనబడి, కుక్కల్లా, రాక్షసుల్లా ... నోరు మూసి—

పెనుగులాడాను...గిజ గిజా తన్నుకున్నాను ...కొట్టుకున్నాను చేపపిల్లలా—ప్చ — లాభం లేదు.

ఓడిపోయాను.

రాక్షసులు గెలిచారు.

తర్వాత లాడ్జింగ్‌కు వెళ్ళి — తనివితీరా ఏడ్చి ప్రొద్దెక్కినాక మీ దగ్గరకొచ్చాను.

నేనేమో ఎంగిలాకును — మీకా పవిసిందేమో జీవితసారథి నామనసునిండా సందిగ్ధత మీమాంస...ఘర్షణ అందుకే కొన్ని రోజులు మీతో ఉండి మిమ్మల్ని స్టడీచేసి తర్వాత సంగతి ఆలోచిద్దామనుకున్నాను.

— అసలు నేను మీకు దరఖాస్తు పంపిన క్షణంనుండి చేసిన పనులన్నీ వెనకాముందు ఆలోచించకుండా, పిచ్చిపిచ్చిగా ఆవేశంతో, అస్వస్థస్థితిలో ఉండి చేసిన పనులు.

గాలి ఎటు వీస్తే అటులా సాగింది ప్రయాణం.

తర్వాత—

మీరూ—సరోజినీ... డాక్టర్ మెహతా... జెంటిల్‌మెన్ క్లబ్ ఇవన్నీ ఓ లోకం. ఈ లోకంలో భౌతికంగా జీవిస్తూ మనస్సును హైదరాబాద్‌లో నాన్న బెడ్ దగ్గర వదిలేసి జీవచ్ఛవంలా బ్రతికాను. మీకు జ్ఞాపకముందా






# జాతీయ భాషా సమైక్యతా గ్రంథములు

## LEARN IN 30 DAYS

| | | | Rs. Ps. |
|---|---|---|---|
| Tamil | Through | English | 3-50 |
| Tamil | Througu | Telugu | 4-00 |
| Tamil | Through | Hindi | 3-50 |
| Tamil | Through | Malayalam | 4-00 |
| Tamil | Through | Kannada | 3-50 |
| Telugu | Through | English | 3-50 |
| Telugu | Through | Hindi | 4-00 |
| Telugu | Through | Tamil | 3-50 |
| Kannada | Through | English | 3-50 |
| Kannada | Through | Tamil | 4-00 |
| Kannada | Through | Telugu | 3-50 |
| Malayalam | Through | English | 3-50 |
| Malayalam | Through | Tamil | 4-00 |
| Malayalam | Through | Telugu | 4-50 |
| Malayalam | Through | Hindi | 3-50 |
| Hindi | Through | English | 4-00 |
| Hindi | Through | Tamil | 3-50 |
| Hindi | Through | Telugu | 3-50 |
| Sanskrit | Through | English | 4-50 |
| Sanskrit | Through | Tamil | 3-50 |
| Sanskrit | Through | Telugu | 4-50 |
| Oriya | Through | English | 4-50 |
| Bengali | Through | English | 3-50 |
| Marathi | Through | English | 3-50 |
| Gujarathi | Through | English | 3-50 |
| Urdu | Through | English | 4-50 |
| English | Through | Tamil | 6-00 |
| English | Through | Telugu | 6-00 |
| English | Through | Hindi | 6-00 |

## EDUCATIONAL BOOKS

| | | |
|---|---|---|
| Balaji's | Book of Letter writing | 6-50 |
| Balaji's | Book of Essays | 3-50 |
| Balaji's | Book of Idioms | 3-00 |
| Balaji's | Book of English Conversation | 3-25 |
| Numerology | | 3-50 |

తెలుగు మాత్రము తెలిసినవారు, హిందీ, కన్నడము, మళయాళము, తమిళము, ఆంగ్లము, సంస్కృతము మొదలగు భాషలను *30 రోజులలో* వ్యాకరణ రీతిగా వ్రాయను, చదవను, మాట్లాడను నేర్పించు గొప్ప గ్రంథములు.

| | | Rs. P. |
|---|---|---|
| 30 రోజులలో హిందీ భాష | ... | 3-50 |
| 30 రోజులలో తమిళభాష | ... | 4-00 |
| 30 రోజులలో కన్నడభాష | ... | 3-50 |
| 30 రోజులలో మళయాళభాష | ... | 4-50 |
| 30 రోజులలో సంస్కృతభాష | ... | 4-50 |
| 30 రోజులలో ఆంగ్లభాష | ... | 6-00 |

ఇవిగాక తక్కిన ఇతర రాష్ట్రభాషలైన బెంగాలీ, మరాఠీ, గుజరాతీ, ఒరియా, ఉరుదు మొదలగు భాషలను ఆంగ్లభాష మూలమునగాను తమ తమ సొంత భాషలలోను నేర్చుకొనవచ్చును.

## సాంకేతిక విజ్ఞాన గ్రంథములు

తెలుగు మూలముగా 1 సర్క్యూట్ నుండి 9 సర్క్యూట్ బలముగలిగిన రేడియోలు తయారు చేయుటకును, రిపేరు చేయుటకును, ఇండ్లయందు వైరింగ్ చేయుటకును, విద్యుచ్ఛక్తి మోటార్ రివైండింగ్ చేయుట ప్రతి వొక్కటిని వివరించు రేఖా చిత్రములతో అమరి యున్నది.

| | | |
|---|---|---|
| ట్రాన్సిస్టర్ రేడియో | ... | 3-50 |
| ట్రాన్సిస్టర్ రిపేరింగ్ | ... | 3-50 |
| హౌస్ వైరింగ్ | ... | 4-25 |
| రేడియో మెకానిజం | ... | 9-50 |
| మోటార్ రివైండింగ్ | ... | 5-25 |




**BALAJI PUBLICATIONS**

53 OIL MONGER STREET,

NEAR ZAM BAZAR POLICE STATION,

**MADRAS-600014,**

లాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**సింహం :—** ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేర్తాయి.

**కన్య :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు సహాయాలు వస్తాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

తుల :— ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు ...వు. సాటివారిలో గౌరవం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ... కృషి రాణిస్తుంది. అనవసరమైన సందేహాలు ...లుగుతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుం

# వారఫలం

టుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

వృశ్చికం :— వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సహా

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

నా అవసరాలు నేను తీర్చుకుంటూంటే
వాళ్ళు కలిగారు
నా అవకాశాలు నేను వెదుక్కుంటూంటే
వాళ్ళు పెరిగారు
నా అవమానాలు నేను కనుక్కుంటూంటే
వాళ్ళు నిలిచారు:
'తమ అవసరాల మాటేమిటన్న
ప్రశ్నార్థకాల గుర్తుల్లా !?

మంచి జరిగే ... ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

ధనుస్సు :— భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

మకరం :— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి, నూతన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

కుంభం :— వ్యతిరేకమైన వార్తలను వింటారు. వృత్తిలో చికాకులు ఏర్పడతాయి. వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. మీ కార్యక్రమాలు బాగుంటాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు

మీనం :— వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో శ్రమకు గురి కాగలరు. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్త్రీలకు— కుటుంబవ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అలంకార వస్తువులు కొంటారు.

— మహేష్

# క్షయ - 4
## వ్యాధి లక్షణాలు

డా॥ ఓ. ఏ. శర్మ

*(గత సంచిక తరువాయి)*

క్షయరోగం తగిలిన వ్యక్తిని పరీక్షించే టప్పుడు ఆ వ్యక్తి జీవిత చరిత్రని కొంత పరిశీలించాలి. పెద్దలయితే ఇన్‌ఫ్లూయంజా వంటి రోగాలు, పిల్లలయితే పొంగు వంటి జబ్బులు వచ్చి పోయాయా అని తెలుసు కోవాలి. గర్భిణీ స్త్రీలలో ప్రసవం అనంతరం పాత వ్యాధి తిరగబెట్టవచ్చు.

క్షయ లక్షణాలు కొన్ని : రోగి చెప్పేవి.

1. అకారణంగా నిస్సత్తువ.

2. ఆకలి తగ్గిపోవటం. పొట్టకి, పేగులకి సంబంధించిన అస్వస్థత.

3. నరాల బలహీనత, మాంద్యత, మనో వ్యాకులత.

4. గుండె దడ. నాడివేగం హెచ్చింపు. ఆయాసం.

5. తరుచుగా జలుబు చెయ్యటం.

6. గొంతుక, శబ్దపేటికకి సంబంధించిన లక్షణాలు : గొంతులో నస, గొంతుక సవరించటం, గొంతు బొంగురు పోవటం, పొడి దగ్గు వగయిరాలు.




### ఊపిరితిత్తులు - క్షయ

వీటితోబాటు జ్వరం వచ్చి పోతూ ఉంటుంది. సాయంకాలం వచ్చి రాత్రి అంతా వుండవచ్చు. జ్వరంతోబాటు చెమటలుకూడా పడుతూ వుంటాయి.

జ్వరంతోబాటు దగ్గుకూడా వస్తుంది. కఫం పడుతుంది. ఇంతకి ముందే దీనిని గురించి చెప్పటం అయింది. కఫంతోబాటు రక్తం జీరలు కనిపించవచ్చును. ఇది ముఖ్యమయిన లక్షణాలలో ఒకటి.

ఇవికాక శరీరభారం, కాళ్ళు — చేతులు నెప్పులు. అరికాళ్ళు - చేతులు మంటలు, కళ్ళు మంటలు వుంటాయి. సాధారణంగా "వేడి లేక ఉడుకు చేసింది" అనే వర్ణన వీటికి సరిపోతుంది.

ఊపిరితిత్తుల క్షయ లక్షణాలు పయిన చెప్పబడినాయి.

మెదడుకి ఈ రోగం సోకితే జ్వరం, వాంతులు, మగత, తలనెప్పి, వెలుతురు చూడలేకపోవటం వగయిరాలు లక్షణాలు. పక్షవాతం కూడా వస్తుంది. చంటిపిల్లలలో తల విపరీతంగా వాచిపోతుంది. వెర్రి రావటం కూడా కద్దు.




### మూత్ర గ్రంథులు - క్షయ

పొట్ట, పేగులు, మూత్రపిండాలు, ఆడవారి జననేంద్రియాలు— వీటికి రోగం తగిలినప్పుడు ఏమవుతుందో ఇంతకి మునుపే చెప్పబడింది. ఆడవారి ఋతుక్రమం తప్పటం వంటివి జరగటమేకాక గొడ్డాలు తనం సయితం రావచ్చు.

### వ్యాధి నిర్ణయం

క్షయ వ్యాధి నిర్ణయం ప్రయోగశాలలో జరుగుతుంది.

కఫం పరీక్ష : ఊపిరితిత్తి క్షయ అయితే కఫాన్ని తీసి పరీక్షించాలి. రోగులు ఈ విషయంలో పూర్తిగా సహకరిస్తేనేగాని రోగ నిర్ణయం తేలికకాదు కఫం సీసాలోకి ఉమ్మి వేసి పరీక్షకి పంపటం కొందరికి అసహ్యంగా ఉంటుంది. పొద్దునలేచి పళ్ళు తోముకున్న తరువాత వేడి పానీయం ఏదయినా తాగినప్పుడు కఫం పడుతుంది. ఒక్క పరీక్షతో క్రిములు బయటపడక పోవచ్చు.

కడుపులోని రసాన్ని గొట్టంద్వారా తీసి కూడా పరీక్ష చేస్తారు. మింగిన కఫంలోని క్రిములు ఇక్కడ వుండవచ్చు. [దీనికి వాడే

# క్షయ

రబ్బరు గొట్టాన్ని హైల్స్ ట్యూబ్ అంటారు]

మ్యాంటో లేక ట్యూబర్క్యులిన్ పరీక్ష : క్షయ క్రిములని నూరి వాటిలోనుంచి ట్యూబర్క్యులిన్ అనే సారాన్ని తీస్తారు. ఇది మదరాసులోని బి. సి. జి. కేంద్రంలో తయారవుతుంది. తాజా ట్యూబర్క్యులిన్‌నే వాడాలి, విమానంద్వారా తెప్పించి వాడుతూ ఉంటారు.

బీజనాళిక
గర్భాశయము
ఓవరి

## జననేంద్రియములు - క్షయ

ఒక మామూలు చెంచాలో సుమారు అయిదు మిల్లీలీటర్‌లు పడతాయి. ఒక మిల్లీలీటరు [కొంచెం స్థూలంగా మిల్లీలీటర్‌నే ఘనపు సెంటీమీటర్ కూడా అనవచ్చు. ఒక లీటర్‌లో వెయ్యవ భాగం మిల్లీలీటర్] లో పదవవంతుని ముంజేతిపైద చర్మంలోకి సూదితో ఎక్కిస్తారు. వెంటనే 7 లేక 8 మి. మీ. దద్దురులేచి పదిహేను, ఇరవయి నిముషాలలో హరించుకు పోతుంది. 48 గంటల పిదప అక్కడ పొంగుమాపి ఎర్ర దద్దురు బయలుదేరుతుంది. 72 గంటలదాకా ఇది మరింత ప్రబలంగా కనిపించి రంగుతేలిపోతుంది. 48 నుంచి 72 గంటల కాలంలో దీని పరిణామాలని కొలుస్తారు. 10 మిల్లీమీటరుల పయిన ఉంటే వ్యక్తిపైద క్షయ క్రిములు దాడి చేశాయన్నమాట. అంత మాత్రాన ఆ వ్యక్తికి క్షయ వుందని అనలేము. ఆరోగ్యవంతులకి కూడా దద్దురు పరిమాణం పెద్దదిగా ఉండవచ్చు. ఉదాహరణకి ఊపిరితిత్తుమీద పొరలోకి నీరు [ప్లూరల్ ఎఫ్యూషన్] చేరినప్పుడు 30-40 మి. మీ దద్దు వెలరేగవచ్చు. అంతేకాక, కొన్ని రకాల క్షయ [మెదడు ఊపిరితిత్తులలో పలు రకాల క్షయ]ని ఈ పరీక్ష తెలుపలేకపోవచ్చు.

ఈ పరీక్ష ముఖ్యంగా పిల్లలలో రోగనిర

యానికి ఉపయోగపడుతుంది. ఏది ఏమయినా ఇంకొక పరీక్షతో రూఢిచేసుకోవటం మంచిది.

ఎక్స్‌రే చిత్రాలు సునిశితమయిన రోగనిర్ణయ సాధనాలు. అయితే వీటిలో కనిపించే లక్షణాలు కొన్ని- మచ్చలు, శలలు, ఖాళీ ప్రదేశాలు, లింఫ్ గ్రంధులు పెరగటం- ఇతర వ్యాధుల మూలంగా కూడా రావటంచేత క్షయ లేనప్పటికీ ఉన్నదన్న భ్రమ కలిగించవచ్చు.

ఎక్స్‌రే యంత్రం ఖరీదయినది. దానికి నిర్వహణ ఖర్చులు ఉంటాయి. బొమ్మలు తీసినా వెల ఎక్కువగానే ఉంటుంది. మైక్రోస్కోపు ఉపకరణం వాడటం కూడా ఖర్చే. ప్రతి ఆరోగ్య కేంద్రంలోనూ ఒక మైక్రోస్కోపు ఉంటే కఫం పరీక్ష తేలికగా చెయ్యవచ్చు.

గొంతులోని రబ్బరు గొట్టంద్వారా తెల్ల మందువేసి ప్రత్యేకమయిన పద్ధతుల ద్వారా ఫోటోలు తియ్యవచ్చు. వీటిని బ్రాంకోగ్రాములంటారు. గొంతులోకి బ్రాంకోస్కోపుని దూర్చి ఊపిరితిత్తులని పరీక్ష చెయ్యటం కూడా ఉంది.

లింఫ్ గంధిని, చర్మముమీదకి తోలుచుకుని వచ్చిన చీముని కోసి అందులోని పదార్థాన్ని పరీక్ష చెయ్యటాన్ని "బయాప్సీ" అంటారు. వెన్నుపూసలోని నీటిని సూది ద్వారా తీసి పరీక్ష చెయ్యటాన్ని "లంబార్ పంక్చర్" అంటారు. ఇది మెదడు క్షయ కోసం చేసే పరీక్షా పద్ధతి.

క్షయనిపోలిన ఇతర రోగాలు కొన్ని ఉన్నాయి. బ్రాంకియక్టేసిస్, ఊపిరితిత్తులలో పుండు, ఊపిరితిత్తుల కాన్సరు, న్యుమోనియా, ఇసినోఫీలియా, క్రానిక్ బ్రాంకయిటిస్ లక్షణాలు క్షయని పోలి ఉంటాయి. ఇది గమనించదగిన విషయం. కొందరికి ఉమ్మిలో రక్తం వేరే కారణాలవల్ల పడకూడా భయం కలిగించవచ్చు.

(ఇంకా ఉంది)

భారత ప్రజానీకానికి దీపావళి శుభాకాంక్షలు !

ప్రభుత్వంచే గుర్తించబడిన ఏకైక బనియన్‌ల సంస్థ

# ఛాంపియన్ !




లక్షలాది ప్రజలు మెచ్చే సరసమైన ధరలు గల మా రకాలు కొన్ని




* ఎమరాల్డ్ ఫైన్
* డైమండ్ ఇంటర్‌లాక్
* జంబో ఫైన్
* వైట్ పెరల్ ఫైన్
* ఎలాస్టిక్ బ్రీఫ్స్
* లెగ్ డ్రాయర్

ఉత్పత్తిదారులు : **ఛాంపియన్ నిట్టింగ్ కంపెనీ**

తిరుపూర్ - 638602 (తమిళనాడు)

ఆంధ్రప్రదేశ్‌కు ఏజంట్లు : **ప్రభాకర టెక్స్ టైల్స్**

వస్త్రలత 133, విజయవాడ-520001.

నటకల వేణుగోపాల్, చిత్తూరు (చిత్తూరు జిల్లాకు మాత్రమే)

ARUNA



2-5-52 : : 24-10-73

**వరాలూ !**

కోటి జ్యోతుల ప్రకాశంతో నాలో ప్రవేశించావు. నా హృదయవీణ మీటి నాలో జీర్ణించుకు పోయావు. నీ ప్రేమానురాగామృతంలో నన్నునుయమురిపించావు. నేకళ్ళు తెరిచేలోగా అమృతస్థానం చేరుకున్నావు. భౌతికంగా నీ వెలితి క్షణ్ణాణం విషాదం కాగా, స్థిరంగా నాలో లీనమై పోయావు.

నీ

బొంబాయి **రామచంద్రన్ కె.వి.**

# ఫోస్‌ఫోమిన్ ఐరన్

**కుటుంబం కోసం... ప్రేమానురాగం, సంతోషం, సంరక్షణ**



**మరి తన కోసం...**

## ఫోస్‌ఫోమిన్ ఐరన్

**స్త్రీల కోసం... ప్రత్యేకంగా రూపొందించబడిన టానిక్**







ఆరోగ్యకరమైన ఎర్రని రక్తకణాలను రూపొందింప చేస్తుంది... శక్తిని తిరిగి ప్రసాదిస్తుంది, దారుఢ్యమును పెంపొందిస్తుంది, శరీరము యొక్క రోగనిరోధక శక్తిని బలపరుస్తుంది.

నియమానుసారంగా ఫోస్‌ఫోమిన్ ఐరన్ సేవించండి.

SARABHAI CHEMICALS LTD.

Shilpi SC 3A/76 tel




# స్వస్తిక్
# పెర్‌ఫ్యూమ్డ్
# కేస్టర్ హెయిర్ ఆయిల్

## ఒత్తుగా, నిగనిగలాడే, ఆరోగ్యకరమైన కేశముల కొరకు



రోజంతా మీ కేశములను దువ్వినవి దువ్విన్నట్లే ఉంచేందుకు—స్వస్తిక్ పెర్‌ఫ్యూమ్డ్ కేస్టర్ హెయిర్ ఆయిల్‌ను మీ కుటుంబంలోని వారందరూ మెచ్చుకుంటారు. నేటి నుండే వాడడం ప్రారంభించండి.

స్వస్తిక్ హౌస్ హోల్డ్
అండ్ ఇండస్ట్రియల్
ప్రోడక్ట్స్ లిమిటెడ్

Shilpi-ship 2A/78 tel

## కొబ్బరి - కారటు - పాయసం * - మానుపాటి జమునారాణి

కావలసిన వస్తువులు: పాలు 2 కప్పులు, కొబ్బరికోరు (పచ్చిది) 1 కప్పు, కారటుకోరు 1 కప్పు, తగినంత పంచదార, ఏలకులు, జీడిపప్పు, కిస్‌మిస్.

తయారుచేయు విధానము: మొదట కొబ్బరికోరును కారటును పాలతో ఉడికించాలి. ఆ తరువాత కొద్దిగా నీళ్ళు పోసి పంచదారను తీగపాకము పట్టి పై మిశ్రమాన్ని పాకములో వేయాలి. జీడిపప్పు, కిస్‌మిస్ ఏలకుల పొడిని వేసి కొద్దిసేపు ఉడికించి దించివేయాలి. వేడిగా ఉన్నపుడే పాయసం తినాలి.



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3 Editor S. Radhakrishna




# ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

## సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్‌వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్
అమోఘము
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL